


జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 15 | రాజమహేంద్రవరం [illegible]-2-1991, 1-3-1992 | సంచికలు 5, 6

—. ఈ సంచికలో రచయితలు .—

1. శ్రీ ఆవంత్స సోమసుందర్
2. శ్రీ ఖండాపు మన్మధరావు
3. శ్రీ [illegible] మోహన్
4. డా॥ మిరియాల రామకృష్ణ
5. శ్రీ ధూళిపాళ మహాదేవమణి
6. డా॥ రామ[illegible] శర్మ
7. శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్
8. డా॥ [illegible]. బాలసుబ్ర[illegible]
9. శ్రీ న. చ. [illegible] రామానుజాచార్య
10. డా॥ సి. సూర్యనారాయణ
11. శ్రీ [illegible] రాధాకృష్ణమూర్తి
12. శ్రీ [illegible]
13. శ్రీ [illegible]
14. శ్రీ [illegible] నరసింహస్వామి
15. శ్రీ చిర్రావూరి [illegible] శాస్త్రి

1, 16 తేదీలలో ప్రచురింపబడును

సంవత్సర చందా రు 20_00 | 6 మాసములకు రు 12_00 | విడి ప్రతి రు. 2_00

—— సకాలంలో చందా పంపి సహకరించండి ——

## సంపాదకుని మాట

జ్యోతి వెలుగు నిస్తుంది. అక్షరజ్యోతి జ్ఞానం అనే వెలుగు నిస్తుంది. గమ్యం చేరడానికి వెలుగు ఎంత అవసరమో జీవితగమ్యం చేరడానికి జ్ఞానంకూడా అంతే ముఖ్యం. అక్షర జ్యోతి కార్యక్రమాల ఉద్దేశ్యం చాలా మంచిది. వాటి నిర్వహణలో చిత్తశుద్ధి ముఖ్యం.

ఏ కార్యక్రమాలు మొదలుపెట్టినా ప్రజలకు మనోవికాసాన్నిచ్చి జీవితగమనం సుఖవంతంగాను, అర్థవంతంగాను జరిగేటట్లు చూడడమే ముఖ్యోద్దేశంగా ఉంటుంది. అయితే మధ్యలో ఈ కార్యక్రమాలు స్వార్థంవంటి చీడ పట్టకుండా చూడాలి. ఇందుకు ప్రభుత్వం అప్రమత్తత, ప్రజల సహకారం అవసరం.

కేవలం ప్రజలలో తెలివి తేటలు పెంచడమే కాకుండా వివేకం వర్ధిల్లేటట్లుగా అక్షర జ్యోతి కార్యక్రమాలు రూపొందించబడాలి. వివేకం శూన్యమై తెలివితేటలు మాత్రమే పెరిగితే మాయ పొర విచ్చుకొని మోసాలు పెరిగి అనర్థాలకు దారి తీస్తాయి.

—సంపాదకుడు

1992 సంవత్సరానికి ''సమాలోచన'' ఆధ్వర్యంలో

**కీ॥ శే॥ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి స్మారక**

**సాహిత్య పురస్కారాలకు సంబంధించిన**

**వివరాలు, నిబంధనలు**

వచ్చే సంచికలో తెలుపబడతాయి.

ప్రతిష్ఠాత్మకమైన ఈ పురస్కారాల గురించి మీ సాహితీమిత్రులకు కూడా

తెలియజేయండి.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**


తెలుగు సాంస్కృతిక జీవనంలో ఆధునికతావికాసం :

## నవ్యకవితా వైతాళికులు వేంకటపార్వతీశ్వరకవులు


— శ్రీ అవంత్స సోమసుందర్


తిరుపతి వేంకటకవుల యుగంతో జంటకవుల శ్రేణి కవిత్వ చరిత్రలో విస్తరితమైంది. సార్వత్రికంగా ఈ జంట కవి బృందాలు అష్టావధాన శతావధాన ప్రక్రియను పోషించడానికే పాటుపడ నారంభించాయి. వేంకట రామకృష్ణ కవులు, కొప్పరపు సోదర కవులు వంటి వారు కొద్దిమందిమాత్రం అవధానాలకే పరిమితంకాక ఇతరేతర కవితాసృజనకు పూనుకున్నారు. ఆ యుగ ప్రభావంతో జంట కట్టుకున్నవారే అయినా వేంకట పార్వతీశ్వరకవులు మాత్రం వారితోవను పట్టి పోలేదు. (వీరు బాలాంత్రపు వేంకటరావు 1880-ఓలేటి పార్వతీశం 1882) వీరు 1901 నాటికే జంటగా ఏర్పడ్డారు. ఆసుకవితాధారకు విముఖులై కవిత్వానికి మాధుర్యగుణం ప్రధానమని విశ్వసించారు. సావధానచిత్తంతో కలసి కూర్చొని, ధ్యానమగ్నులై కావ్యనిర్మాణమైనా, నవలారచన అయినా, వంగీయ నవలానువాదమైనా కొనసాగించారు. కవితారచన నవీనమూ, భావపుష్టమూ కావాలని త్రికరణశుద్ధిగా ఆశించారు.

వీరియువురికీ ఆత్మీయబంధువు విమర్శకాగ్రేసర నడకుదుటి వీరరాజుపంతులుగారే వీరిని అనుసంధానించారు. మార్గదర్శకులుగా నిలచారు. 1908 లో కల్పలత అనే సాహిత్య పత్రిక కొన్ని ప్రశ్నలు ప్రచురించి సమాధానాలు పద్యాలలో పంపిన ఉత్తమ రచనకు బహుమతి ఇవ్వనున్నట్లు ప్రకటించారు. ఒకరికి తెలియకుండా ఒకరుగా ఈ ముగ్గురూ సమాధాన పద్యాలు రచించి పంపారు. ముగ్గురికీ బహుమతి పంచబడింది. ఆ సంఘటనే వీని ఏకంచేసినా. వీరరాజుగారు తమ కృషిని విమర్శరంగానికే కేటాయించుకొని, వీరియువుర్ని వేంకటపార్వతీశ్వర కవులుగా సంధానించారు. భావప్రధానంగా కవిత్వాన్ని పండించమని ఆదేశించారు. తదాదిగా వీరు కవిద్వయమై, ఒకే రెమ్మకు పూచిన జంటమందారాలవలె మరందధారలు కురియనారంభించారు.

ఈ జంట కవుల ప్రాదుర్భావానికి కల్పలత పత్రిక ప్రథమ కారణం కాగా, వీరరాజపంతులు చరమనిర్ణేతలయ్యారు. కవితారంగంలో వీరి ప్రవేశంతో ఒక కొత్త మాధుర్య గుణప్రధానమైన నవీన యుగం ప్రారంభమైంది. భావబంధురత ప్రధానలక్ష్యమైనట్టుంది. భావమే ప్రాథమిక వస్తువుగా కవితానిర్మాణ సౌందర్యం భాసించనారంభించింది. ఇది తత్పూర్వమెన్నడూ లేని తేజస్విష్ఠతగా వెలుగొందింది ఆ అపూర్వగుణం ఈ క్రింది కల్పలత పద్యంలో స్పష్టమవుతుంది.

“తన ప్రియుడు రాకగోరుచు నతం
డరుదేరక మోముకాంచి కి
గ్గున మదిలో పరంగొనెడు కూరిమి
తాల్పదయేక కాగిటం
జానిపియు లోచిదిక్కులలు చూచునో
యేమి ? యటంచు నద్దెసల్

గనుగొను వారుణీపతి విలాసచూపులో!
సాంధ్యరాగమో?"

అంటూ ఒక ప్రాకృతిక స్థితిని మానవీకరణం చేసి, మూర్తిమంతం చేయడం పూర్వసాహిత్యాలలో సకృత్తుగా ఉన్నా, అది కథాంతర్భాగవర్ణనా సందర్భంలో కలగలిసిపోయింది. వేంకటపార్వతీశ్వర కవులు తమ భావాన్నే పద్య వస్తువుగా మార్చి ప్రాణవంతం చేశారు. భావమే వస్తువుగా గల కవితనే భావకవిత్వం అనే నిర్వచనానికి నాంది పలికారు. రెండేసి పద్యాలను సైతం ఖండకావ్యమని పిలిచే సాహసం ప్రథమతః వారే చేశారు. దీనిని సంప్రదాయవాదులు అప్పటికీ యిప్పటికీ గర్హిస్తూనే ఉన్నారు. ఆంధ్ర సాహిత్యచరిత్రలో 1908లో తొలిసారిగా రచించిన కావ్యకుసుమావళి ఆదిపీఠమిచ్చింది. రెండు సంపుటాలుగా మొత్తం 615 పుటల కావ్యకుసుమావళి 1924లో గ్రంథాలుగా ప్రచురింపబడి, ఒక కొత్త ఒరవడికి స్థిరరూపమిచ్చింది.

అప్పట్లో ప్రఖ్యాత విమర్శకులు, విద్యాధికారులు చేమర్తి రాజగోపాలరావు ఆంగ్లంలో విపులమైన పీఠిక రచించారు. ఈ శతాబ్ది ఆరంభంనుంచీ నూత్న కవితారీతిగా సాగుతున్నది వేంకటపార్వతీశ్వరకవుల యుగమేనని మొదటిసారి వారే విస్పష్టంగా పేర్కొన్నారు. దానికి కారణం వారిలా వివరించారు. "To them the Telugu Novel owes its present day perfection, and Telugu poetry is by them made to run its new phases and ways of thought that it had never reached before". అని వ్యాఖ్యానించారు. ఆరుబయటకు ఆహ్లాదంగా దర్శనమిచ్చే చెట్టును పరికించడం ఎవరికైనా తేలికే; కాని దాని మూలాల పరివ్యాప్తిని పోల్చుకోవడం చాలా కష్టం. ఆ పనిని నిశితంగానూ, అనసూయాత్ములూ అగు కుసుమావళీ తత్త్వగ్రాహులు ఆచార్యరనే చేమర్తివారు ఎనిమిది పుటల పీఠికలో నిర్వహించారు.

కావ్యకుసుమావళికి 'ఉపోద్ఘాతం' రచించిన విమర్శకాగ్రేసరులు ఇరవైనాలుగు పుటల విశ్లేషణ జరిపారు. కుశాగ్రబుద్ధి తేటంగా ఈ కవుల నవ్యకవిత ఏ పద్యం నుంచి ఆరంభమైనదీ వికల్పించారు. వారిలా ఉద్ఘాటించారు: "ఇందు శైలి, రీతి, నిర్మాణము మొదలగువానిలో పూర్వకవుల పోకడలు కొన్ని గానబడుచున్నను, కావ్యపద్ధతిమాత్రము మన యాంధ్రభాషకు నూతనమై వెలయుచున్నది. పురాణేతిహాసములయందును నిబంధనముల ననుసరించి ప్రబంధములయందును పురవనాది వర్ణనములు గానబడుచున్నవి. గాని ఈ పద్ధతి ననుసరించినది మన భాషయందు మృగ్యమై యున్నది.' అన్నారు. అంతేకాక వారే యింకా స్పష్టంగా కావ్యకుసుమావళి అభినవత్వాన్ని యిలా వివరించారు. 'దేశకాల పాత్రముల ననుసరించి సాంఘిక నైతిక రాజకీయాది వివిధవిషయముల యందభిరుచులు మారుచున్నట్లే కవితయందును మార్పులు గానబడుచుండును. వేంకటపార్వతీశ్వర కవులకు ఆంగ్లేయ భాషాపరిచయము లేకపోయినను, పాశ్చాత్య విజ్ఞాన వాతావరణముగల ప్రకృతినాశ్రయించి, వీరి సహజప్రతిభ పాశ్చాత్యపద్ధతిని ప్రాచ్యకవితయందు మార్చి యీనూత్న కావ్యమును సృష్టించినారు. ఆంధ్రభాషయందీదృశ్య కావ్యసృష్టికిదియే ప్రథమంబైనను మనోహరాకృతిం దాల్చినది.' అన్న వ్యాఖ్యానింపు నిర్వివాదము!

తిరుపతి వేంకట కవులకుగాని, వేంకట రామకృష్ణ కవులకు గాని, కొప్పరపు సోదరకవులకుగాని మరెవ్వరికిగాని యీ ప్రశంస ససేమిరా అతకదు. అందుకే వీరే నవ్యకవితా వైతాళికులుగా గణుతికెక్కారు. విమర్శకాగ్రేసరులే ఒక లోపమును కూడ ఎత్తిచూపించారు. 'మానవ ప్రకృతి సౌందర్యములకు మగ్గమై ... లీలానుభవ లాలసయగుచున్న యీ కవితా కన్య మానవ ప్రకృతిం గూర్చి గానము సేయుట మరచిపోయినట్లగుచున్నది.' అన్నమాట ఎంతయథార్థమో అంత నిశితమైనదికూడ. పునరుజ్జీవన కాంతికలికలకు ప్రకృతి సంబంధము నిషేధంకాదు కాని, మానవప్రకృతి నుండి దూరమనివార్యమే, వీరు నెలకొల్పిన యీ దుష్టసంప్రదాయమే భావకవిత్వంలో సామాజిక నిరసనగా ఘనీభవించింది. కలాయాన వాదకేంద్రం ఘనీభవించింది. అందుకే వేంకట పార్వతీశ్వరకవుల యుగాన్ని చీల్చుకొని మహాకవి గురజాడ మానవీయ మహోదయాన్ని ప్రవేశపెట్టాల్సిన చారిత్రక అవసరం ఏర్పడింది.

భావసౌకుమార్యాన్ని సులలిత శైలిలో అభివ్యక్తం చేయడం అనూచానాంధ్రకవితా మార్గానికి భిన్నమైనది! అందుకే వీరి మార్గాన్ని భావకవులు కొనసాగించారు. ఉత్తరోత్తరా నవ్యకవిత్వాన్ని సంపన్నం చేశారు. వృత్తపద్యాలను సకృత్తుగానూ, తేటగీతి ఆటవెలది, మంజరీద్విపద, రగడలవంటి దేశిఛందాలను విరివిగానూ భావకవులంతా తమ కవితా వాహికలుగా స్వీకరించుటకు ఉత్తేజకమందించిన ఆద్యులు వేంకటపార్వతీశ్వరకవులే! వీరు నెలకొల్పిన కలవిహంగ మధురిమల గానలహరి భావకవుల సందడిని పలికించింది. వీరే నవ్యకవిత్వంలో మార్మిక భక్తితత్పరతకు అన్యులై సంపూర్ణగానాలు వెలయించారు. అగోచరామరత

మైన భావాలకీ, ఎదలోతుల అనుభూతులకీ ప్రత్యక్షానుభూతిగా వాక్కుకు స్వరూపం ఘటించారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఉపోద్ఘాతంలో ఏకాంతసేవ అనే విశిష్ట కావ్యం ప్రచురితమైన నాలుగేళ్ళకే బృహత్కావ్య సంపుటులుగా కావ్యకుసుమావళి వెలువడింది. వేంకట పార్వతీశ్వరులు వ్యక్తులుగా భిన్నులే; కాని కవితా హృదయ నిష్యందులుగా అద్వితీయులే! పొన్న పూగొమ్మకు పొగడ యున్నదియు - పొగడయే యున్నదో పొన్న పూగొమ్మ! ఊహింప రాకుండ ఒకటినుండి- ఇరువురి పరిమళం చిమ్మి యిది యనుచు విభజింప రాకుండ విలసిల్లుచుండె!'' అని వారే చెప్పుకున్నంత అవిభాజ్య రేఖలో భాసించారు. అతి సుందరములైన తెలుగు మాటల పోహళింపుతో సీసపద్యాలను పునస్సృజించి రాయప్రోలు, కృష్ణశాస్త్రి ప్రభృతులకు ఆదర్శప్రాయులయ్యారు.

1907 నుంచి 1919 వరకూ పిఠాపురం దివాన్‌గా ఎన్నో సత్కార్యాలకు కారణభూతులైన మహారాజావారి గురువు, దివానూ శ్రీ మొక్కపాటి సుబ్బారాయుడుగారు ఈ కవులు విరచిస్తున్న నూతనపక్కీ కవితలను ఆరంభం నుంచీ శ్రద్ధగా చదువుతూ ఎంతో ప్రోత్సహించారు. వారే మహారాజాకు సిఫారసు చేసి, 1910లో ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల ప్రారంభిస్తున్న సమయంలో - 'మా కమూల్య సహాయముగా ముద్రణాయంత్రమును ప్రసాదించి' కృతార్థులను చేశారు. శ్రీ వేంకటపార్వతీశ్వర కవుల రచనలో లాలిత్యము, హృద్యమూ, సౌకుమార్యమూ- స్త్రీ బాలాదులకు సహితమూ పరవశింప చేసే ప్రసాద గుణమూ ప్రధానలక్షణాలు. అన్వయక్లిష్టత గాని, అనర్థావగాహనగాని ఎక్కడా కనిపించదు. కాని అతిలాలిత్య మాధుర్యాలవల్ల కొంత మెత్తలతనం కాలక్రమేణా కలగడం అనివార్యమే!

చారిత్రకంగా వేంకట పార్వతీశ్వర కవులు నవ్యకవిత్వానికి కల్పించిన సాయం ప్రాశస్త్యం గురించి తక్కువ అంచనా వేయడం చారిత్రకంగా ద్రోహమే! వారిద్దరి కన్న పదిహేను సంవత్సరాలు చిన్నవారే కృష్ణశాస్త్రి, కాని 1916 నుంచీ భావకవిత్వానికి ముఖద్వారమై దాంధ్రలోనూ విశేషప్రచారం ఉద్యమంగా కొనసాగించిన మహావ్యక్తి! ఈ శతాబ్దంలో కవిత్వాన్ని ఉద్యమదీప్తితో ప్రచారం చేసిన మహావ్యక్తులిద్దరే- ఒకరు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, రెండోవారు కృష్ణశాస్త్రి, మొదటివారికి వాతావరణ అనుకూల్యత హెచ్చు. పద్యమొకటనకు తెలియనంత ప్రవాహగమనంతో ఉపన్యాసాలలో అలవుగా పద్యాలు కురుగులతిని జనసామాన్యాను ఆకర్షించేవి. కాని కృష్ణశాస్త్రిపని అంత సులువుకాలేదు. ఐనా అనర్గళోక్తి వైభవంతోనూ భావకవితా గానమాధుర్యంతోనూ జనాన్ని ఆకర్షించి-నవ్యకవితకు సహానుభూతిని ప్రోదిచేశారు ఈ కిశోరకవి గురుతుల్యులైన దేవులపల్లి సోదర కవులకు పుత్రుడు కావడంవల్లనే భావకవితకు భాష్యకారులు కావడంవల్లనే. ఏకాంత సేవకు వారిపీఠిక ఉండాలని యీ కవులు కోరుకున్నారు. అదిగ్రంథంగా 1920లో వెలువడింది. పోతనగారితో ప్రారంభమైన మార్మిక కవిత్వానికిది పరాకాష్ఠ. దానిగురించి వివరిస్తూ కృష్ణశాస్త్రి, భావకవిత్వానికి మేనిఫెస్టో అనదగిన అద్భుత వ్యాసం రచించారు.

కృష్ణశాస్త్రికి సహాధ్యాయి, మిత్రుడు, ఏకేశ్వరోపాసనా గురువులైన బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి సచ్ఛాత్రుడై నూతనాలోచనలకు ప్రోది చేసుకుని. పూర్తివాదిగా ఎదిగిన శ్రీ పాటిబండ మద్దుకృష్ణగారు - సంకలించిన 'వైతాళికులు'లో వెం. పా. కవుల గురించి యిలా వివరించారు. 'వీరు మొదటి రకంగా యోగసాధిలోనివారు. భక్తి పట్టిన మహాపరవశులు. వీరివాణి కొండయేటివలె మంజుగానంతో అతిశ్వరితంగా ప్రవహిస్తుంది. వైష్ణవగీతాలలోని ప్రేమాస్వాదం వీరిభావోద్రేకాన్ని ఎక్కువగా రగిల్చింది. భావకూర్పులో, పలుకు విధానంలో నూతనత్వాన్ని కల్పించారు.' అన్నమాటలు వైతాళికులు 9వ ముద్రణనుంచి ఉల్లిఖితాలు, కాని ప్రథమముద్రణలో వీరిగురించి మరెన్నో విశేషాలతో మరింత విపులీకరించినట్లు జ్ఞాపకం! 'వీరు నవ్యకవిత్వానికి వైతాళికుల వంటివారు.' అన్న మాటలుకూడా ఉండినట్లే జ్ఞాపకం. ప్రథమ ద్వితీయముద్రణ లెక్కడైనా లభిస్తే సరి చూసుకోక తప్పదు.

శ్రీ వెం. పా. కవుల స్థానం గురించి ఏకాంత సేవ పీఠికలో కృష్ణశాస్త్రి నిర్ద్వంద్వంగా తెలిపారు. 'తెనుగునకీనాటి కాంధ్రసారస్వతమున వసంతోదయమైనది...ఏకాంత సేవ అట్టిమహాగ్రంథములలో నగ్రస్థానము నలంకరించు దానిలో నొకటి. కవనమున పండితులనిన లక్షణములన్నియూ నిద్దానికి సంపూర్ణముగ గలవు. నూతనాంధ్ర సారస్వతములో నిట్టి కావ్యము వేరొకటి లేదని నానమ్మకము.' అని వక్కాణించారు. అంతేగాక ఏకాంత సేవ ప్రాధాన్యతను ప్రకటిస్తూ - ఇది భాగవతము వలెనే పఠింపతగినది. ప్రేమింప తగినది. శిరసావహింపతగినది... వంగభాషకు రవీంద్రుని గీతాంజలి యెట్టిదో మనయాంధ్రమున కీమహాకవుల, భక్తుల ఏకాంత సేవ అట్టిదని 'నా అభిప్రాయము' అని ముగించారు.

శ్రీ వెం. పా. కవులు. వంగభాష నుంచి పరశ్శరంగా అనువదించి ప్రచురించిన నవలలేకాక – స్వతంత్రంగా రచించిన వసుమతీ వసంతం, మాతృమందిరం వంటి నవలలు ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలను ప్రభాసింపచేశాయి. వసుమతీ వసంతం నవలప్రాశస్త్యాన్ని కొనియాడుతూ విశ్వనాథ సత్యనారాయణగారు – 'దానిని చదివినపుడు నేనెంతో ముగ్ధుడనైతిని. ఎప్పటికైనను నేను యింత గొప్ప నవల వ్రాయగలుగుదునా యని అబ్బురపడితిని.' అంటూ, ఒక వ్యాసం ఆంధ్రపత్రికలో ప్రచురించారు. మాతృమందిరంలో హరిజనులను అస్పృశ్యులుగా వెలివేయుటను ఖండించి, అది మహాపాతకమని, వైదిక మతమునకు భంగకరమని ప్రతిపాదిస్తారు.

వారిషష్టిపూర్తి మహోత్సవం – అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారి ఆధ్వర్యకంలో రాజమహేంద్రిలో ఒకగొప్పసాహిత్యోత్సవంగా జరిగింది. ఆ సందర్భంలో శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి సంపాదకత్వంలో నవ్యకవితా సంకలనం – మహోదయం ప్రచురితమైంది. ఆ సందర్భంలోనే – తల్లావజ్ఝల, దేవులపల్లి – జనమంచి కామేశ్వరరావుగార్ల సంపాదకత్వంలో భావసంకీర్తనమూ, మరికొన్ని కృతులు ప్రచురింపబడ్డాయి. భావసంకీర్తనం ఒక అపూర్వ ప్రయోగాత్మక కావ్యం. అట్టిదివధూతో నథవిమ్మతి అనడమూ సమంజసమే! మచ్చుకొక పద్యం, 'నీయంత వానిని, నిజముగా మనుజడమును చేసితిని. సరె. మనసు తెచ్చి పెట్టితి కేటికి? గిట్టనితనముగా ఉండిన; దానికి కొండితనము. దొంగతనమ్మును, దొరతనమ్మును, జగలంజె తనమ్ము–కూలంకపముగ మప్పి, కనకమును గొప్పరాజ్యంబును, కాంతామణుల జూపి, వింత నాటకంబు నాడింప నేటికి?' – కనులనుండి నవ్వుచున్నావో! తెలియనిదిసి కర్మమో? తెలిసి తెలియనట్టి నాకర్మమో? నిజము నిజము ప్రభు!' ఆనే విచిత్రగతిలో, కేవలవచన కవిత్వం మాదిరిగా నడుస్తాయి, కాని నిజానికిది అన్న సీసపద్యాలే నని ఛందస్సు తెలిసిన వారికి తెలుస్తుంది. లేనివారిని ఖులాసాగా చదివింపచేస్తుంది, ఈశ్వరునికీ భక్తునికీ అవిభాజ్యమైన ఒక అద్వైతసిద్ధినే వెలార్చుతూ హృదయార్పణగా సాగుతుందీ కావ్యం. ఏకాంత సేవ రచించిన కవులు బృందావనం రచించిన కవులు యిలాంటి అపరూప కావ్యం ఎలారచించారా అన్న ఆశ్చర్యం కలుగుతుంది.

దీనికి తల్లావజ్ఝలవారు నాలుగుపుటల పీఠిక రాశారు, కాని అది అంతంతమాత్రంగా కేవల వ్యాపారసరళిగాసాగింది. ఈ గ్రంథం చదివి ఆ పీఠికపై నాసోదరులు డా. మిరియాల రామకృష్ణ యిలా రిమార్కు రాశారు, 'ఈ కావ్య సౌందర్యం నాపీఠిక చెప్పజాలదు.' అని అది అక్షర సత్యమే!

వేంకట పార్వతీశ్వర కవులు ఇతర కావ్యాలెన్నో రచించారు 'సుప్రసాదిక నవలలు కలగానువాదాలు. స్వీయాలు, యితరులకీ ప్రచురించారు. ప్రచురణ సంస్థకోసం ఒక కారు కొని – పిఠాపురం కాకినాడ కార్యాలయం నడుమ సంచరించారు. అతులాదిగా ధనం సంపాదించి ఒక్క పైసా అయినా మిగుల్చుకోలేకపోయారు. చివరిలో రామాయణమును సైతం చంపూకావ్యంగా సుందరకాండలో సీతాదర్శన పర్యంతం రచించారు. అప్పటికే వారు నవ్యసాహిత్యంలో పురు సమానధీరులయ్యారు. అట్టివారి గురించి పీఠిక రాస్తూ ఎంతో చరిత్రక ప్రాధాన్యతను ఆవిష్కరించవలసివుంది! ఆపని శ్రీ శివశంకరలు చేయకపోవుడం, కారణమేదైనా క్షంతవ్యంకాదు.

ఆకాలంలో వెంకట పార్వతీశ్వరుల ప్రభావం నవ్య కవిత్వ మంతటిపైనా

---

# ప్రబంధం

**అందాపు మన్మథరావు**

నేను బాధలను దిగమ్రింగే మర్మగర్భాన్ని
మట్టినిబంగారంగా మార్చేరత్నగర్భాన్ని
కష్టించే ఫలితాన్నందలేని శ్రామిక జీవులు
పట్టెడన్నం ఎరుగని అమాయక గోవులు
ఉన్నారు లక్షోపలక్షలు
అయినా
నారక్షణ వ్యయం కోటాను కోట్లు
విప్పిస్తున్నాయి కాలేకడుపుల ఆకలికేకలు
ఎవరూ సరిచేయలేనినష్టజాతకప్రయాణాలు
అందివ్వాలనేఉందినాబిడ్డలందరికీ స్వత్వం
స్వార్థరాజకీయ కుట్రల (కు) బంధాల్లో
బందీనైనందున ఈ జన్మకు అదిమ్యగ్యం
బిడ్డలందరికీ సమంగా తిండిపెట్టలేనితల్లిని
ఏలోకం హర్షిస్తుందనీ? ఏ సమాజం
మాత్రం
ఆదరించి గౌరవిస్తుందనీ?
అందుకే
ప్రబోధిస్తున్నా తిరగేయండి గతచరిత్ర
అందులో కన్పిస్తుంది పరశురామ చరిత్ర
మీరే అపరశురాముని వారసులు
వచ్చి చీల్చేయండి రెండుగా నాగుండెలు
నిందించను మిమ్మల్ని మాతృహంతలనీ
ఆనందిస్తాను నాబాధవిముక్తి ప్రదాతలని
ఎందుకంటే బాధలను దిగమ్రింగే
మర్మగర్భాన్ని
మట్టిని బంగారంగా మార్చే రత్న
గర్భాన్ని

0—0

---

పోల్చుకోతగినంత స్పష్టంగాపరచుతుంది. ఒకగొంతు కొత్తందనాన్నీ, పారశ్యభరిత వాగ్వైభవాన్ని తెలుగు కవితాలోకంలో ప్రపంచించింది. అవిస్మరణీయ శక్తిగా నవీనకవిత్వంలో స్థిరపడింది. ఇరవయ్యో శతాబ్దిని సంపద్వంత మొనర్చిన ప్రమాణకం తాలలో నిరవధిక ప్రాముఖ్యత నందుతుంది. (ఇంకా ఉంది)

# శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారి "నా కవన కదంబము"

## (సమీక్షాసారథం)

—శ్రీ పి మోహన్

ఇది 'నాకవన' కదంబం; నా 'కవన కదంబం' అంటున్న కవిరత్న శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారు స్టేట్ ఎక్సైజ్ డిపార్ట్‌మెంట్‌లో సూపరింటెండెంట్‌గా వృత్తిపరంగా ఉద్యోగించినా, ప్రవృత్తి పరంగా కవితల్లుతూ సుపర్ప్రపద్యకవిగా బనగానపల్లికిబంగిని పిల్లి తీపిలా తీపులందించారు. చిన్నకోట-కాటూరి లిటరరీ & ఛారిటబుల్ ట్రస్ట్ వారి 'ట్రస్ట్'ను పొంది ఇంట్రెస్టింగా నాకవన కదంబం అందించారు.

అట్టలో అరవై పుటలుగల యీ అపూర్వ గ్రంథరాజం 'అమ్మ'కు అంకితం కావటం నిజంగా 'ఆదర్శం' 'దత్తాత్రేయుని సంప్రదాయమునకున్ దత్తంబైన' తమకంకంలో శ్రీ గొల్లాపిన్నివారు తమ కదంబంలో తొలిపూవును "శ్రీసచ్చిదానంద గణపతిస్వామికి' సమర్పించటం ముదావహం.

'దుర్వ్యదయతా మరుభూమి నింపు దశ్వాత్తంగి' 'గీతాంజలిం'చిన శ్రీ శాస్త్రిగారికలం 'చీమ యేనియును ఖమ్ము పెందచేసి'-'పువుడెంద మదర కన్నీరు విడిచే" బుద్ధదేవునికి పద్యాంజలి ఘటించారు.

"నుతత్వవాదములలో వ్యర్థప్రసంగాలతో, తెంకేరాని వితండ వాదములతో, క్రీడా కరాలాపకన్ కలగం బారెడు కంఠశోషణలతో 'కాలం వ్యర్థం చేయ వద్దని మూర్ఖాన్ని తెండా కన్ని పద్దులాలుకు మాటల్లో తమదైన విశాలభావాన్ని మధురంగా వ్యక్తం చేశారు శ్రీ శాస్త్రిగారు-'మహేంద్రోదయంలో' ధారాశుద్ధితో - 'తెలుగుం బిడ్డల దృష్టకంతులయి-అజరామరంబగు మహేంద్ర ప్రాభవ శ్రీలతో తులతూగాలని' శుభాకాంక్షించారు.

'తెక్కలాడినగాని డొక్కలాడని పేద కూలీల కన్నీట జాలులోన' ప్రతిబింబించిన జనతా జనార్దన సేవాతత్పరుడైన "అర్థనగ్న ఫకీరు" బాపూజీని పద్యార్చన చేసిన శ్రీ శాస్త్రీజీ మన దేశంపై చైనా ఆకస్మికంగా దాడిచేసినప్పుడు స్పందించి 'భద్రాయిత హైమశైల పరిరక్షణతత్పర వీరులకు' అక్షర నీరాజనా అర్పించారు.

రెండుపాదాలతో 'చిన్నారి రాముని చిలిపిచేష్టలకు మురియుచు జాబిల్లి'ని ముందుకు నడిపించారు అందంగా' కౌసల్యా మాతృహృదయుమంత ఆమంద ఆనందంగా అక్షరంగా!

'పతురా! రమ్ము! ర'మ్మంచు హూత విడుచు' సంభాషణ శైలిలో రాజపుత్రి (Canpbell గారి Lord ullıns' daughter)ని తెలుగింత తియ్యగా చిత్రించారు-పద్యాల పల్లకి నెక్కించారు. ఆంగ్లాక్ష సౌందర్య సుందరికి తెలుగు తొడుగులందించి అందాలు పెంచారు.

సామాజిక స్పృహతో 'మిత సంతాన' సందేశాన్నందిస్తూ - "ఓగిర మందు లేదు పస; యోపిక లేదు శరీర మందు ... మతి భంగపాటులున్ శాకల కాలమందు తగునా బహు సంతతి కష్టపాటులున్' అంటూ తమదైన బాధ్యతను అక్షరంగా నిరూపించారు.

'ఆశానిరాశ'ల డోలాయమాన జగత్తులో-'అప్పుపుట్టను-పుట్టిన యింకలోన సరుకు దొరకదు - మండిన ధరలతోడ-భుక్తికైనను లేకలక క్షేని .. గుండెలబగులగొట్టు మగల యగచాట్లను కనులకు కట్టినట్లు అక్షర చలన చిత్రాలను చూపిస్తూ-పూర్వయుగాలకు భిన్నంగాగల నేటి స్థితికి ప్రతిరూపంగా - 'ధరలు పెరుగుట-పెరుగుట కొలకేగాని' వని శాస్త్రిగారు స్వానుభవాన్ని భవతో గాల్ని ఎత్తిచూపారు.

ద్వంద్వముల కతీతుడైన పూజ్యపాద త్యాగరాజనుతలందించిన శ్రీశాస్త్రిజీ శ్రీ మంగాల హనుమంతరాయకవిగారిపై స్మృతిపద్యార్చనచేశారు. ఆస్తికమహాశయులైన శ్రీశాస్త్రిగారు - 'వైజ్ఞానిక స్వామల్ - నాస్తిక వాదుల్నీ' విరచిస్తూ జ్యోతిర్మార్గ యోగ దగ్గర 'శ్రీ సాధు శ్రీనివాస శాస్త్రిగారి'ని నిల్చియున్న హైందవాన్ని కాపాడమని ప్రార్థించారు.

గహనంబైన వేదమతాన్ని కమ ఉపన్యాసఫణితిలో అర్థవంతంబుగా వ్యక్తీకరించిన శ్రీ ప్రభాకర ఉమామహేశ పండితులను ఓవైపునుతిస్తూ, 'గండు కోయిల' 'కుహూ' కలనాదములోని 'ప్ర' పంచమ స్వరమున శల్లవించిన కవికోకిల జాషువాను ప్రశంసించినారు. 'అలఘు తరార్కక క్తిగల యట్టి మహర్షి 'శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిని పద్యద్వయ సంభావన లందించారు.

అనుభవమే పనికొస్తుంది. నిన్నా మొన్నా తాను రాసిన పద్ధతి ఎంతమందికి వచ్చింది? ఎంతమందికి వచ్చలేదు? ఎందుకు వచ్చింది? ఎందుకు వచ్చలేదు? అనే ప్రశ్నలు వేసుకుంటే, ఏ కవిఅయినా ఇకముందు తానెలా రాయాలో ఒక తీర్మానానికి వచ్చేస్తాడు.

కావ్యం రచించే పద్ధతిలో ఎన్నో అంశాలున్నాయి. పదజాలం, శైలి. నోటికీ చెవికీ సంబంధిస్తాయి. భావ చిత్రాలు కంటికీ మనస్సుకీ చెందుతాయి. కల్పనలు, సన్నివేశాలు బుద్ధిని స్పందింపజేస్తాయి. రసానుభవం ఆత్మను లోబరుచుకుంటుంది.

మనిషి కేవలం ఇంద్రియాలతో తృప్తి పడడు. ఇంద్రియాలకు సంతోషం కలిగిన వెంటనే. మనస్సుకు తృప్తి కలిగిందా అనిపిస్తుంది. ఆ తరవాత హేతువుల నాలోచిస్తాడు. ఇంకా అతనికి ఏదో కావాలనిపిస్తుంది. దాన్నే మనం రసం అంటున్నాం.

కవికి సంబంధించినంతవరకూ ఇవన్నీ విధానంలోనే చేరతాయి. ఈ విధానం గురించి తరతరాల నుంచీ శాస్త్రాలు వస్తున్నాయి. శాస్త్రం ఆగిపోదు. కొత్త విధానంతో కొత్త శాస్త్రం వస్తుంది. ఈ శాస్త్రాలు కవికి తానెక్కడ నుంచి బయలుదేరాలో చెబుతాయి తప్ప ఎక్కడిదాకా వెళ్ళాలో చెప్పలేవు.

ఎటువైపు వెళ్ళాలో ఎక్కడిదాకా వెళ్ళాలో నిర్ణయించుకోవలసింది కవిత్వ విషయంలో కవే.

ఇలా నిర్ణయించుకోవడంలో కవికి అతిముఖ్యమైనది కావ్యంలోని విషయం. ఈ విషయాన్నే వస్తువుఅనీ అనడం మామూలు. ఈ కావ్యవస్తువు నిర్ణయించుకోవడంలో అతనికి రెండు అంశాలు సహకరిస్తాయి. మొదటిది కాలం. రెండోది జ్ఞానం.

కాలం అంటే కవి జీవిస్తున్న కాలం. ఈ కాలానికి ముందుకూడా ఎంతో కాలం ఉంది. దాన్ని మనం చరిత్ర అంటాం. చరిత్రకు మరో పేరు గతం గతంలో మనిషి నడిచిన తీరు నంతటినీ చరిత్ర వివరిస్తుంది. మనిషికి సంబంధించిన ఏ విశ్లేషణ అయినా చరిత్రలో భాగమే అవుతుంది. కనుక విజ్ఞానశాస్త్రాలన్నీ చరిత్రలోని భాగాలే.

రెండోదయిన జ్ఞానం నా ఉద్దేశంలో కవి సంపాదించుకుని జీర్ణంచేసుకున్న విజ్ఞానమే. అనేక శాస్త్రాలు చదవడం వల్ల అనేక దేశాలు తిరిగి రావడంవల్ల వికసించిన బుద్ధివిశేషమే జ్ఞానం. దీన్నే ప్రజ్ఞ అంటున్నాం.

విశ్లేషణకోసం కాలం-జ్ఞానం అంటూ రెండు విభాగాలు చేసినా ఈ రెండూ పరస్పరం సంబంధంగల ఒకే అంశం ఈ రెండింటినీ కలిపి 'కాలజ్ఞానం' అనొచ్చు.

దృక్పథంఅనీ, యుగధర్మ వివేచన అనీ సమకాలిక స్పృహఅనీ సామాజిక స్పృహఅనీ రకరకాలుగా మనం చెప్పుకుంటున్న పరిభాషలన్నీ 'కాలజ్ఞానం' లోని అంశాలే.

కావ్యవస్తువుని నిర్ణయించుకుని, కావ్యంగా రాయడానికి కవికి "కాలజ్ఞానం" ఎంత అవసరమో కావ్యవిధానశాస్త్ర జ్ఞానం కూడా అంతే అవసరం.

కావ్యవిధానశాస్త్ర జ్ఞానాన్ని వివేచన లేకుండా వాడుకునేవాడు కొత్తగా దేన్నీ సృజించలేడు. కాలజ్ఞానం లేకుండా కావ్యరచనకు తొందరపడేవాడు ఏది రచించినా పాతదే అవుతూఉంటుంది.

ఈ రెండింటినీ సంపాదించుకున్నప్పుడు మొదటిదానివల్ల కవికి ప్రయోగకౌశలం (Craftmanship). రెండోదానివల్ల కళాసృష్టి కర్తృత్వం (Artistry) వస్తాయి.

ఈ భూమికతో నేను పరిశీలించదలచిన ఆధునిక కావ్యం విశ్వంభర. జ్ఞానపీఠ పురస్కారం పొందిన డాక్టర్ సి. నారాయణరెడ్డి విశిష్టసృష్టి విశ్వంభర. విశ్వంభర విశ్లేషణ ఈ వ్యాస పరంపరలో చేయబోతున్నాను.

## విశ్వంభర విశ్లేషణ-1

నారాయణరెడ్డిగారు ఈ కావ్యాన్ని 5 భాగాలుగా విడదీసుకున్నారు వాటికి ఎలాంటి శీర్షికలూ నిర్ణయించుకోలేదు. అంతమాత్రాన ఏ భాగంలో ఏ అంశం ఎంతవరకూ చెప్పాలో నిర్ణయించుకోలేదని మాత్రం మనమనుకోకూడదు ఈ భాగాలను పాతపద్ధతిప్రకారం సర్గలనో ఆశ్వాసాలనో అధ్యాయాలనో కూడా పేరు పెట్టలేదు. 1, 2. 3, 4, 5 అని అంకెలుమాత్రం వేసి ఊరుకున్నారు.

ఈ కావ్యానికి ఆయన రాసిన ప్రస్తావన చాలా ముఖ్యంగా పాఠకులకు కనిపిస్తుంది. ఈ కావ్యం రచించడానికి ముందుగానే ఆయన కావ్యవస్తువును గురించీ అందులోని భాగాలను గురించీ ఒక "రేఖాచిత్రం" మనసులో గీసుకున్నానని చెప్పుకున్నారు. ఆయన ఈ భాగాలను "ప్రకరణాలు" అన్నారు. చరిత్రద్వారా మనకు తెలిసీతెలియని కాలంనుంచీకూడా మనకు బాగా తెలిసిన ఈనాటికాలందాకా మనిషి ఏవిధంగా నడుస్తూ వస్తున్నాడో ఈ అయిదు ప్రకరణాల్లోనూ ఆయన వివరించారు యీ అయిదు ప్రకరణాలూ అయిదు "ప్రస్థానాలు" ఆయనదృష్టిలో !

మొత్తం మానవచరిత్రలో అయిదు దశలను ఆయన గుర్తుపట్టారు. ఈ అయిదు దశలకూ ఆయన పేర్లు పెట్టలేదు. అడవిలో పుట్టిపెరిగిన మనిషి నగరాలవరకూ సాగి ఏవిధంగా నాగరికుడయ్యాడో ఈ అయిదుదశల్లోనూ కనిపిస్తుంది.

వెనుక "భూమిక"లో మనం విశ్లేషించుకున్న కాలజ్ఞానం, కావ్యవిధానశాస్త్రజ్ఞానం అనే రెండు ప్రజ్ఞలూ ఈ కావ్యం రచించేనాటికి ఈయనకున్నాయనడానికి ఈ ప్రస్తావనే చాలును.

మనిషి ఇంతవరకూ సాగించిన కృషినంతటినీ మూడుభాగాలుగా గుర్తుపట్టారీయన. మొదటిది కళలకు సంబంధించిన కృషిఅంతా రెండోది విజ్ఞానానికి సంబంధించిన ప్రయత్నమంతా మూడోది మానసిక ప్రపంచానికి సంబంధించిన సాధనలన్నీ. ఈ మూడురకాలయిన కృషినీ చేయడంలో ఆ మనిషి మొదటే విజయాలను పొందలేదు. అనేక ప్రతికూల పరిస్థితుల నెదుర్కొన్నాడు. ఈ పరిస్థితులకు అతను నిరుత్సాహపడలేదు. వాటినన్నింటినీ తట్టుకుంటూ ముందుకి సాగిపోతున్నాడు. వెనక్కు మళ్ళిపోవడంలేదు.[3]

ఈ రహస్యం చరిత్రను పరిశీలిస్తే తప్పకుండా మనకు తెలుస్తుంది ఇంతవరకూ జరిగిన చరిత్రలోని తత్త్వమిదే

ఈ తత్త్వాన్ని నిరూపించడానికే ఈ కావ్యం రాసినట్లు మనకు స్పష్టంగా తెలుస్తుంది.

అయితే ఈ కావ్యం ఎవరికోసం రాసినట్లు ? పాఠకులు భిన్నతరగతులకు చెంది ఉంటున్నారు. అన్ని తరహాలవారినీ సంతోషపెట్టడానికి రాసే కావ్యాలు వేరు. వాటిల్లో కథ చాలా ప్రధానంగా ఉంటుంది. పదజాలం సాదాసీదా ఉంటుంది రసం ఉట్టిపడుతుంది. కానీ అది బుద్ధిని పదునుపెట్టి ఆలోచింపజేయడం కుదరదు.

ఈ "ప్రస్తావన"లో నారాయణరెడ్డిగారు స్పష్టంగా చెప్పారు "విశ్వమానవేతిహాసాన్నీ, అవధిలేని మానసకోశాన్నీ అవగాహన చేసుకున్న సహృదయులకు' ఈ కావ్యం సంతృప్తినిస్తుందని [3] ప్రపంచ మానవుని తరతరాల చరిత్ర పాఠకులకు తెలిసేఉండాలి ముందు. కానీ దానితో సరిపోదు. మానవుని మనస్సును గురించి ఎన్నో విశ్లేషణలు జరిగాయి ప్రపంచంలో. తత్త్వశాస్త్రాలన్నీ "మనస్సు"ను గురించి చెప్పినవే. మనస్సు ఒక పెద్దలోకం. ఈ లోకం గురించి తెలుసుకోవడం ఆధ్యాత్మిక చింతనకిందికి వస్తుంది [4]

ఏతావతా నారాయణరెడ్డిగారు ఈ కావ్యం రాయడంలో చరిత్రనీ తత్త్వశాస్త్రాన్నీ ఆధారాలుగా తీసుకున్నారని అర్థమవుతుంది. ఏ కొద్దిగానయినా ఈ రెండూ తెలిసినవారికే ఈ కావ్యం ఉద్దేశింపబడింది.[5]

ఇలాంటి కావ్యవిషయానికి ఎలాంటి కావ్యవిధానం కావాలో అలాంటి విధానంలోనే ఈ కావ్యమంతా రచించారాయన. విషయవిధానాల (Context and Technique) సమ్మేళనంలో కవికి సర్వవిధాలా స్వేచ్ఛ ఉంది. ఆ స్వేచ్ఛను పూర్తిగా నారాయణరెడ్డిగారు వాడుకున్నారు.

వచనంలో కవిత రాయడం ఇరవయ్యో శతాబ్దంలో ప్రత్యేకంగా గుర్తింపు పొందింది. అయితే వచన కవిత ఖండకావ్యాలకే పరిమితమవుతూ వచ్చింది. పెద్దకావ్యాలనుకూడా వచన కవితలో రాయడానికి కొందరు ప్రయత్నం చేస్తూఉన్న యుగంలో నారాయణరెడ్డిగారు ఆ ప్రయత్నాన్ని అందుకుని పెద్దకావ్యం ఇలా ఉండాలి అనిపించేటట్లుగా రాశారు "విశ్వంభర"ని.

విశ్వంభరను ఆయన "సమగ్రకావ్యం" (Integral epic) గా పేర్కొన్నారు. అయిదు ప్రకరణాల యీ కావ్యంలో ఏ ప్రకరణంలో ఏముందో అధ్యయనం చేయాలి. నెంబరు 1 గల ప్రకరణాన్ని ముందుగా పరిశీలిద్దాం.

# శ్రీ యుధిష్ఠిరాశ్వమేధ చంపూ ప్రబంధం - ఒక విహంగాకవనం !

— డా. రామడుగు వేంకటేశ్వరశర్మ

"గద్యానుబంధరస మిశ్రిత పద్య సూక్తిః హృద్యాహివాద్య కలయా కలితేవగీతిః'' చంపూ ప్రక్రియనుగూర్చి భోజకవి చేసిన ప్రశంస అది. సంస్కృత సాహిత్యంలో రామాయణ భారత భాగవత చంపువులు, నీలకంఠ విజయ విశ్వగుణాదర్శ చంపువులు విలక్షణంగా వెలువడ్డాయి. క్రీ.శ. 915 లో త్రివిక్రమభట్టు నలచంపువుద్వారా సంస్కృతంలో ఈ ప్రక్రియకు శ్రీకారం చుట్టాడు. బాల భాగవత చంపువు వ్రాసిన అవసరాల పద్మరాజకవివంటి తెలుగువారు సంస్కృతంలో అనేకులున్నారు. అట్టివారిలో శ్రీ యుధిష్ఠిరాశ్వమేధ చంపూ ప్రబంధ కర్త శ్రీ వగుటూరు వెంకటశాస్త్రి ఉరఫ్ వెంకయ్యశాస్త్రి ఒకరు.

ఈయన సురపురసంస్థాన రాజవిద్యాగురువు. ధర్మాధికారి. హైదరాబాదుకు చెందిన లింగసూగూరుజిల్లా సురపురం తాలూకా కసబాసురపురం నివాసి అని ఈ గ్రంథప్రకటనంలో ఉంది. సురపురానికి షోలాపురం వ్యవహారనామమనీ, ఇది నేడు గుల్బర్గా మండలంలోని ఒక సీమ అనీ 'ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము'నే గ్రంథంలో ఆచార్య తూమాటి దోణప్పగారు పేర్కొన్నారు.

ఈ కవి శతావధాని. కవిసార్వభౌముడు. ఈయన గురువు శ్రీనివాసార్యవర్యుడు. ఈ కవి నాగేశ్వర సుధీంద్ర తనూజుడు. భాస్కరవిపశ్చిదనుజుడు. నృసింహశాస్త్రి జనకుడు. ఆర్వేలవంశ సంజాతుడు. శ్రీవత్ససగోత్రుడు. ఒకటి రెండు చోట్ల పాఠాంతరాలు కలిగి బహుపండిత పరిశీలితమైన ఈ గ్రంథాన్ని వీరి యల్లుడు యలమటూరు వెంకప్పగారు 1891 లో చెన్నపురి శారదా ముద్రాలయంలో ప్రకటించారు. ఈ గ్రంథరచనలో ఒకటి రెండుచోట్ల నృసింహశాస్త్రిగారి హస్తం కనిపిస్తుంది.

ఇది పది స్తబకాల గ్రంథం. ధృతరాష్ట్ర ధర్మజ సంభాషణతో ఇది ఆరంభమైంది. వ్యాసభారతంతో దీనికి పోలికలు తక్కువ. మరుత్తరాట్చరిత్ర అందులో సుదీర్ఘంకాగా ఇందులో అత్యల్పం. దీనికి జైమినిభారతంతోనే పోలికలు ఎక్కువని చెప్పాలి. యౌవనాశ్వ సుధన్వాదులతోడి యుద్ధం అక్కడా ఇక్కడా దాదాపు సమానమే. అయితే అందలి ముంగిసకథ మున్నగునవి ఇందులో లేవు. ఒకటి గుర్తుంచుకోవాలి. అది పురాణం. ఇది కావ్యం.

ఇక సజీవ పాత్రచిత్రణ విషయంలో ఈ కవికి అంతగా దృష్టి ఉన్నట్లుగా కనపడదు. కాబట్టే మయూరధ్వజుడు విప్రవేషంలో ఉన్న కృష్ణార్జునులకు తన అర్ధశరీరాన్ని సమర్పించే సంఘర్షణాత్మక ఘట్టంలో ఆ రాజును, అతని దారాసుతులైన కుముద్వతీ తామ్రధ్వజులను సజీవ పాత్రలుగా చిత్రించలేదు. అక్కడ కథను వేగంగా నడిపాడు కవి. అదీగాక యుద్ధవర్ణన ప్రధానమైన ఈ కృతిలో సజీవ పాత్రచిత్రణకు అంతగా అవకాశం లేదుకూడ.

గద్యసంఖ్యకంటే పద్యసంఖ్యే ఎక్కువగా ఉన్న ఈ కృతి ప్రధానంగా రసాలంకార రంజితమనియే ఆరంభంలో కవి చెప్పుకోవడం జరిగింది. ఇందులో వసంత గ్రీష్మవర్షాశరత్ హేమంత వర్ణనలు, సూర్యోదయ సరోవరవర్ణనలు, వ్యాసాది వ్యక్తిస్వరూప యజ్ఞాశ్వ, పురవర్ణనలు, ప్రత్యేకించి యుద్ధవర్ణనలు విభిన్నరీతులలో కనిపిస్తాయి. శబ్దార్థ సంబంధాలైన చమత్కార కల్పనలు ఈ కావ్యగత వర్ణన శ్రీకి తీయని సువర్ణాభరణాలు.

"రక్తాప్సరస్సు రుచిరామజ్జంతిస్మ
క్షణం రణే
రక్తాప్సరస్సు త్రిదివే తేమమజ్జుస్సదా
ముదా॥ (5 స్తబ-68 శ్లో)

ఇది సురథార్జున యుద్ధఘట్టంలోనిది. రక్తసరోవరంలో ఏ వీరులు మునుగుతున్నారో వారు స్వర్గంలో సంతోషంతో అనురక్తలైన అప్సరసలయందు ఆసక్తులౌతున్నారని ఇందలి భావం. రక్తాప్సరశ్శబ్దం ఇందులో చమత్కారభరితంగా ప్రయుక్తం.

యౌవనాశ్వునితోడి యుద్ధంలో భీమసేనుడు తనపేరుకు సార్థకం చేసుకున్న తీరు హృదయంగమం.

'సభీమసేనో ధురి భీమసేనాం॥
ధృష్ట్వా స్వనామ్నోధిక దీర్ఘ భావం
సంచింత్య తత్రాసహ మానవేనాం।
విభేదయామాస గభీరచేతాః'
(2 స్తబ-18 శ్లో)

గభీరచేతసుడైన ఆ భీమసేనుడు తనపేరులో కంటే అధికమైన దీర్ఘభావం గల భీమసేనను చూసి విచారించి అసహమానుడై ఆ సైన్యాన్ని ఛేదించాడట. 'భీమసేనః - భీమసేనాం' అనే శబ్దాలలో

ఉన్న హ్రస్వ దీర్ఘాక్షరాల్ని దృష్టిలో పెట్టుకొని కవి చేసిన చమత్కారమిది.

'రటద్ఘటాకోటి సకేతఘోటాః॥
పటచ్ఛటా రాజిత కేతు కూటాః'
(2 స్తబ-49 శ్లో)

ఇత్యాదిగా భావానుగుణమైన వృత్త్యనుప్రాసరూపమైన శబ్దాలంకార చమత్కారాలు ఇందులో కోకొల్లలు. అంతేగాక యుద్ధవర్ణన ప్రధానమైన ఈ కృతిలో ఆ వీరులతో పాటు ఈ కవి కూడ రచనలో పదాలతో బంతులాడాడు తెలుగు సాహిత్యంలో నాచన సోమనాథునిలా కొన్నిచోట్ల. ఇందుకు సురథాసుర యుద్ధసన్నివేశవర్ణనం తార్కాణం.

'సురథస్సురథః ఖరదోశ్శర దోర్ద్విరదాన్
దరదాన్ శరదాన్ విరదాన్
విమతం శమితం రణగం వ్రణగం
ముకుటం వికటం వ్యకరోత్ సుకరమ్'
(5 స్తబ-55 శ్లో)

అలాగే గద్యరచన కూడ కనిపిస్తుంది.

తెలుగు కవులు తమ కావ్యాల్లో సర్వలఘుకందాలను వ్రాసినట్లుగా ఈ కవి "ప్రతిపద సమితి సముచిత ఘననినద యుతా' (7 స్తబ-84 శ్లో) ఇత్యాదిగా సర్వలఘుశ్లోకాన్ని యుద్ధ సన్నివేశంలో సముచిత రీతిని రచించాడు.

తరచుగా తెలుగు కావ్యాల్లో దేవతాస్తుతిలో, వనవర్ణనాదుల్లో కాన వచ్చే సుదీర్ఘ రగడచ్ఛందస్సు ఇందులో మయూరధ్వజ కృత కృష్ణస్తుతిలో కానరావడం, భాష సంస్కృతమైనా, తెలుగుయతి ప్రాసలను పాటించడం మరో విశేషం.

'కటితట పటుతర కనకదుకూలం।
చటులాలక యుతచారు నిటలం
మణిగణశోభిత మస్తక భూషం।
ధణ ధణ రాజిత తారక వేషం...'
(9 స్తబ-189 శ్లో)

ఇత్యాదిగా.

అలాగే దశమ స్తబకంలో బ్రహ్మకృత పరమేశ్వర స్తుతిలో దశకంధర రావణ స్తవంగా ప్రసిద్ధికెక్కిన పంచచామర వృత్తసౌందర్య వింజామరలు 'జటాకటాగ్ర నాటి తటిన్య భంగవీచికా 1 చ్ఛటాలుఠత్ స్ఫటీకవల్లి వల్లితోత్తమాంగకం ..' (10 స్తబ-82, 88 శ్లో) ఇత్యాదిగా రెండుశ్లోకాల్లో హాయిగా వీస్తాయి.

అలాగే ప్రసిద్ధమైన మహిషాసుర మర్దనీ స్తుతి శ్లోకగమక ధోరణిలో ఈ స్తబకంలోనే ఉన్న ఈశ్వరస్తుతిలో-

'సవహర శంకర సత్పుర శంకర
సాధుశివంకర సామరుచే
కలిమలహారక కామితపూరక
కామనివారక కాంతరుచే
ఫణిగణ భూషణ పండిత పోషణ
పాపవిపేషణ ఫాలరుచే
జయజయ హే త్రిపురాసుర భంజన
నిత్య నిరంజన సాంబశివ॥'
(10 స్తబ-85 శ్లో)

ఇత్యాదిగా రెండుశ్లోకాలు హృదయానికి ఆహ్లాదం కలిగిస్తాయి. 'అంతరాయతిమిరోపశాంతయే' అన్న విఘ్నేశ్వరస్తుతికి ఇందులో నకలు ఉన్నా శ్లోకం గమకం మాత్రం ప్రమోదసంధాయకం.

ఇక భావసాబలం విషయానికి వస్తే వడిపోయిన సురధుని నిమీలిత నేత్రాల్లో లోభివాణ్ణి సందర్శింపచేసిన ధోరణి అమోఘం-

'నయనగత కృష్ణరూపం।
ప్రోన్మీలాద్గన్నతిభి -ఘీర
సనిమీలిత నేత్రాభ్యాం।
యుక్తం తన్మస్తకం దదాతస్మై
(5 స్తబ-77 శ్లో)

సూర్యుండు నామక పువ్వుగుచ్ఛాన్ని ఇంద్రి అనే యువతి పశ్చిమ దిక్కు అనే యువతిపై ఎగుర వేసిందన్న భావంగల శ్లోకాన్ని చదువుతుంటే ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యకృతిలోని 'ప్రాగ్వధూమణి చిమ్మ పశ్చిమ దిక్కాంత పట్టిన చెంగల్వబంతి యనగ' అన్న పద్యపాదం గుర్తుకు రాక మానదు.

'రాత్రౌ వార్తాం పరిజ్ఞాతుం గచ్ఛతా
కర్మసాక్షిణా
ఆత్మీయా ఇవ నిక్షిప్తాః జద్యోతః
జ్యోతిలింగకాః॥'
(9 స్తబ-19 శ్లో)

రాత్రిపూట వార్తలను తెలుసుకోవడానికి సూర్యుడు-తాను కర్మసాక్షి నిలిపిన ఆత్మీయ తేజస్సులవలె మిణుగురు పురుగులు ప్రకాశిస్తున్నాయట! ఈ శ్లోక భావాన్ని గమనిస్తే పాండునికి కాళిదాసు రఘువంశంలోని 'దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః' అన్న శ్లోక పాదభావస్ఫూర్తి గుర్తుకురాక మానదు. పై శ్లోకంలో కర్మసాక్షి - ఆత్మీయ శబ్దాలు సాభిప్రాయాలు! సార్థకాలు!

'నాసోపరి కనన్నీలం మండమం సఖి!
భాతికే
గంధఫల్యగ్ర సంలగ్నమూర్ఛన్
లోలంబ కాబరత్.;
(9 స్తబ-26 శ్లో)

అన్నశ్లోకంలో సంపెంగ ఘాటుకు మూర్ఛపోయిన తుమ్మెద పిల్లలా చెలి నుదుట నీలం కుండలము ప్రకాశిస్తోందన్న కవికల్పనలోని భావసౌందర్యం సహృదయాకర్షకం.

'ధూమోయత్ర హితత్ర వహ్నిరితి
యద్వ్యుక్తంహి యథాగ్నిరి
త్యుక్తంచేదిదమప్యశిష్యజనతా సత్యార్థ
వార్థం దివి
నిష్ఠ్యూతం నయనాంబ్రుధేర్జ్వల
మయఃపిండ ప్రకాండం యథా
తీక్ష్ణాంశుః పరితృప్యకేరుణ తమప్రత్యగ్ర
జాగ్రద్ద్యుతిః.'
(2 స్తబ-9 శ్లో)

వృషకేతువితో పలికే సూర్యతేజోవర్ణనాత్మకమైన పై భీముని వాక్యంలో 'యత్రధూమస్తత్రవహ్నిః' అనే తర్కశాస్త్రసంబంధమైన న్యాయం సందర్భోచితంగా వాడబడింది. ఈ న్యాయానికి అసత్యాన్ని సమకూర్చడానికా అన్నట్లుగా పొంగలేని కాంతితో సూర్యుడు తప్తాయః పిండంలా ప్రకాశిస్తున్నాడట! 'అగ్నేరాపః' అన్నశ్రుతికి సార్థక్యం కూర్చడానికా అన్నట్లుగా సముద్రంలో బడబాగ్నియే ఆకాశానికి తెల్లి మేఘాల్లో మెరపు తీగలుగా మెరిపిస్తోందన్న కల్పనం వైజ్ఞానిక స్ఫోరకం.

సంస్కృత వ్యాకరణంలో సమాసాంత ప్రకరణంలో 'అచతుర విచతుర ...' ఇత్యాదిగా ఒక సూత్రం ఉంది. దీన్ని విటీవిటుల సంభాషణలో కవిఇలా ప్రయోగించాడు.

'అద్యాం రూపం హిత్వా స్త్రీయోగాత్
రూప మన్యదేతి ప్రుమాన్
అనుభూయైవహి పాణిని రచతుర
సూత్రేతిదా, వ పాఠేదమ్'
(9 స్తబ-116 శ్లో)

ఇచట పుంలింగశబ్దాలు స్త్రీ ప్రత్యయంతో కలిసి వేరే రూపాలను పొందుతాయి. అనే విషయం శృంగారపరంగా చమత్కారంగా సమన్వయింపబడింది.

వ్యక్తిస్వరూప వర్ణనల్లో ఇష్టదేవతాస్తుతిగా ఈ కృతి ఆద్యంతాల్లో అతి శంకరాచార్యులను అభినుతించడం అపూర్వాంశం.

గద్యాలలోగూడ వ్యక్తిస్వరూప వర్ణనలు కల్పనామహితంగా కనిపిస్తాయి. ఇందుకు వ్యాసర్షి స్వరూపవర్ణన తార్కాణం. దీనికి కాదంబరిలోని మునికుమారక వర్ణనం ప్రేరణ కావచ్చు. కాదంబరి గద్యంలో విశిష్టభావాభివ్య సముదాత్తోపమా శ్లేషోక్తి, ఒకే గద్యరచనలో రకరకాల గమకాలూ అధికమైతే, ఇందులో ఒకే గద్యవాక్య సమూహంలో రకరకాల గమకాలు లేకపోయినా, సురుచిరరచనయైన కాదంబరి ప్రేరణతో ఉత్ప్రేక్ష అపటాక్షేపవిక్షేపగుణం అక్షయం-అక్షరం. శ్లిష్టంగా, విశిష్టంగా రామాయణకథా పాత్రల పేర్లు స్ఫురించేలా అర్జునుణ్ణి "తదానీం సుగ్రీవాం చితోప్యాఘజాత ప్రబలోప్యసీతాభిరామ స్సుమిత్రాత్మజోపీంద్ర జద్బలాహార్యవక్ష అంగానురహార్త్రా సదాభరతోపి చరణత్రాణభజన కాకుత్స్థ్య గణితమాండవీక ప్రతీకాశశ్శత్రుఘ్నోపి శ్రుతికీర్తి కామితోప్యరఘుకులసంజాత ఏతాదృశః పాండుసూను రావాపదోహాలీనస్ అపామాస."(6 స్తబ 35) అనే హృద్యగద్యంలో వర్ణించినరీతి శ్లాఘాపాత్రం. "అసీతాభిరామస్సుమిత్రాత్మజోపి"ఇత్యాదిగా భుజంగప్రయాత వృత్తాది గమకాలు గలిగిన వృత్తగంధి వాక్యాలు ఇందులో తారసపడతాయి.

వర్ణన లెంతకాగున్నా, కొన్ని కథ మరచిపోయేంత విస్తృతంగా ఉన్నాయి. కృష్ణుడు అష్టభార్యలతో కలిసి చేసిన సరోవరవర్ణనం ఇత్యాదులు ఇందుకు తార్కాణాలు. అయితే యివి సంభాషణ రూపంలో నడవడం విశేషం.

యుద్ధవీరం ప్రధానరసమైన ఈ కృతిలో యుధిష్ఠిరశబ్దం సాభిప్రాయం-సార్థకం. ఇతర రసాలుగా నవమస్తబకంలోని విటీవిట నాయికానాయక సంభాషణల్లో శృంగారం, తృతీయ స్తబకంలోని శ్రీకృష్ణ భీముల సరససల్లాపాల్లో హాస్యం ద్యోతకమౌతున్నాయి.

ఇలాంటి ప్రౌఢప్రబంధం ఎందువల్లనో సంస్కృత వాఙ్మయచరిత్రలోనికి చేరలేదు. ఏదైనా మొత్తంమీద భారతంలో జనమూ-చేతనూ, భాగంలో కండ-గుండె గల మహోద్దండ పండిత కవిప్రకాండుడు ఈయన. ఈ కవి స్తుతించిన భారతిదేవే కాదు ఈ చంపూకృతికూడ స్ఫురత్పదసమన్విత. చలనం లేకుండగ మహార్యమణిగతి సంకలితమైన సంధాయిని.

—0—

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

— శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

క్రీ. శ. 1302 లో అల్లాఉద్దీన్ ఖిల్జీ మొదటిసారిగా ఓరుగల్లు మీదికి ఎత్తి వచ్చాడు. ఆతర్వాత 1321 వరకు మొత్తం 6 సార్లు మహమ్మదీయులు ఓరుగల్లును ముట్టడించి 6 సార్లూ ఓడిపోయారు. జరాసంధుని ఓటమిలో ఎఱ్ఱయగారు ఈవిషయాన్నే సూచించారు. అయితే ఓటమితో కసిపోక మరింత ఉత్సాహంతో - మరింత పట్టుదలతో - మరింత పెద్దసైన్యంతో మహమ్మదీయులు ఓరుగల్లును ముట్టడించి క్రీ. శ. 1323 లో 7వ సారి యుద్ధంలో విజయం సాధించి తమ చిరకాల వాంఛితాన్ని తీర్చుకున్నారు. ఈ విషయాన్ని కాకతీయ సంచిక విపులంగా వివరించింది.

హరివంశంలో కాలనేమి వృత్తాంతం ఉంది. జరాసంధుడి ప్రోత్సాహంతో అతడు మధురమీదికి వచ్చాడు. ఆవృత్తాంతాన్ని ఇలా వర్ణించారు ఎఱ్ఱయగారు.

వచనం : అపరిమిత గజవాజి భటోత్కరంబులగల నిరవధిక సేనాసముదాయంబులతో మధురపై ఏతెంచు సమయంబున-

ధరణీచక్రము గ్రుంగిదిక్కరటి సంతానంబుపై డిందని
ర్భర భారాతుర భోగిరాట్ఫణ తతుల్ భగ్నంబుడం గూర్మక
ర్పర భేదంబునదూలి బిట్టుసకల బ్రహ్మాండమూం గంపమం
దొరయున్ దుస్థితినొంద భీధర వరాఘాతంబులై ఘాతముల్.

అతవులడవి కొండలమీద నదరి యఖిల
వార విధులను బిండిలి వండుసేసి
కమలహితు గ్రమింగి శిఖలు తీకట్లు గాలిపి
దరగ యవనసైన్యోద్ధతి యంగుళరజము.

ఉ భా.-ఆ 2-ప 121,22,23.

ఈ వర్ణింపబడ్డ యవనసైన్యోద్ధతి కాలయవనుడిది కాదు. అది అతిరథ ఎఱ్ఱయగారి కాలంలో ఆంధ్రదేశాన్ని ముంచెత్తిన యవనులదే! పై వచనంలోని 'నిరవధిక సేనాసముదా'యాలు కూడా ఓరుగల్లుమీదికి వచ్చినవే! ఇక్కడి 'నిరవధిక' శబ్దం సాభిప్రాయమైంది. క్రీ.శ. 1320 లో వచ్చిన తురకసేనలు 1321 వరకు పోరాడి ఓడిపోయాయి. ఆంధ్ర చక్రవర్తి విజయోత్సవాలలో మునిగి ఆదమరచాడు. అయితే-నాలుగు నెలలైనా తిరుగకుండానే క్రీ.శ. 1322 ప్రారంభంలోనే మళ్ళీ వచ్చిపడ్డాయి.

ఈసందర్భంలో కాకతీయ సంచికలో డా॥ మారేమండ రామారావుగారి వ్రాతను ప్రతి హిందువు చాలా జాగ్రత్తగా పరిశీలించాలి.

"ఆంధ్ర సామ్రాజ్య పతనమునకు కేవలం తురుష్కుల కార్యదీక్షయూ, యుద్ధనైపుణియూ నే గాక నితర కారణములు కూడ నిండినవి. వానిలో మొదటిది యాంధ్రుల దృష్టిమాంద్యము. రెండవది వారి యంతఃకలహములు."

-కాకతీయుల చరిత్రము-పు77.

డా॥ మారేమండవారు అంతఃకలహాలు రెండవ కారణం అన్నప్పటికీ నిజానికి అదే మొదటి కారణం. ఈసందర్భంలోనే నాయు అనవేమారెడ్డి స్వాతంత్ర్యం ప్రకటించుకొని- బొబ్బారెడ్డి తురకలతోలంచం తీసుకొని ప్రతాపరుద్రుని ఓటమికి కారణమయ్యారని చెప్పారు. కాని, ఇది సత్యంకాదని, ప్రతాపరుద్ర చరిత్ర తప్ప ఈ అంశాన్ని నమ్మడానికి మరో ఆధారం లేదని శ్రీ) వర్ధాది అప్పారావుగారు రెడ్డి సంచికలో (పుట 28) వ్రాశారు. ఈ వాదోపవాదాలుఎలాఉన్నా హిందూ జాతి చరిత్ర పుటలను తిరుగవేస్తే హిందువుకు మొదటి శత్రువు హిందువేనన్న సత్యం స్పష్టమౌతుంది. హిందువు హిందువుకు చేసిన ద్రోహంవల్లనే ఈ దేశం పరాధీనమైంది. సంస్కృతి కలుషితమైంది. జాతి నిర్వీర్యమైంది. ఎందరు మహానుభావులు ఎన్ని ప్రయత్నాలు చేసినా అవి తాత్కాలిక ఉపశమనాన్ని కలిగించినవేకాని శాశ్వతమైన కాయకల్ప చికిత్స జరుగలేదు.

తన కాలంనాటి అనైక్యతను-పరస్పర అన్యాయాద్వేషాలను- వాటి విషఫలితాలను ఎఱ్ఱయగారు ఎంతో ఆవేదనతో గ్రీష్మఋతువు వర్ణన పేరుతో వర్ణించారు.

తమలో దాయిడి గొన్నయున్నతుల
సద్వంశంబులుల్ దూపరం
సమయింపం దను యాత్రికావలిని
సెన్నంగా నిజంబిట్టి భా
వము నూదుండననట్లు వేసవి మహా
వంశాటవుల్ ద
గ్ధములయ్యెన్నికట ద్రుమావలులతో
గ్రందంగా దావాగ్నులన్!

-ఆ. 6-ప. 86

సంఘంలో అధికారులు, పెద్దమనుషులు తమలో తాము కొట్టుకుంటే వారు నశించడం మాత్రమే కాదు. వారిని నమ్ముకొని ఉన్న వారుకూడా నశిస్తారు. వేసవిలో అడవిలోని పెద్దపెద్ద వెదురుబొంగులు ఒకదానితో ఒకటి రాసుకోవడంచేత అగ్ని పుడు

తుంది. ఆ అగ్ని ఆ చెట్లను మాత్రమే దహించివూరుకోదు. వాటి చుట్టురా ఉన్న చిన్నచిన్న చెట్లను, పొదలను చివరకు ఆ అడవినే తగులబెడుతుంది.

ఆనాటి రాజకీయచరిత్రను గమనిస్తే ఎఱ్ఱనగారు ఎంత ఆవేదనతో ఈ పద్యం వ్రాశారో తెలుస్తుంది. ఒకవంక దేశాన్ని, సంస్కృతిని రక్షించాలని కాకతిప్రతాపరుద్రుడు ఏకవీరుడై పోరాడుతుంటే మరోవంక దేవగిరి యాదవులు ఆంధ్రుల మీద పెంచుకున్న అకారణద్వేషాసూయలతో విధర్మీయులు, విదేశీయులైన వారికి ధనకనక వస్తువాహనాలిచ్చి దండయాత్రలకు ప్రోత్సహించారు. అందుకు ఫలితంగా దేవగిరి యాదవరాజే తురుష్కులకు తొలి కబళమైనాడు. ఆ తర్వాతే ఆంధ్రప్రతాపరుద్రుడు. ఆనాడు ఈ రెండు రాజవంశాలు కలిసిమెలిసి ఒకరికొకరు తోడై పోరాడిఉంటే దక్షిణ భారతదేశ చరిత్ర మరోరకంగా వ్రాయబడిఉండేది.

హరివంశం యాదవుల చరిత్ర. యాదవులు చంద్రవంశీయులు. ప్రాచీన రాజవంశాలు మూడు. చంద్ర, సూర్య, అగ్ని వంశాలు. వీటిలో చంద్రసూర్యవంశాలు విస్తృతిలోనే కాక విఖ్యాతిలోకూడా ప్రసిద్ధమైనవి.

చంద్రవంశీయుడైన నహుషుడు మానవుడై ఉండికూడా ఇంద్రసింహాసనాన్ని అధిష్ఠించి త్రిలోకాధిపత్యం నెరపాడు. నహుషుని కుమారుడు యయాతి రాక్షసగురువు శుక్రాచార్యుని పుత్రిక దేవయానిని పెండ్లి చేసుకున్నాడు. రాక్షసరాజు కూతురు శర్మిష్ఠతో దేవయాని అభీష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించి శుక్రుడి ఆగ్రహానికి గురియయ్యాడు. ఫలితంగా అసమయ వృద్ధాప్యాన్ని పొందాడు. అప్పటికే ఆతడికి ముగ్గురు కొడుకులు కలిగారు. యదుతుర్వసులు దేవయాని కుమారులు. పూరుడు శర్మిష్ఠ పుత్రుడు. అయినా ఆయనకు కామేచ్ఛ తీరలేదు. కొంతకాలం ఎవరైనా యౌవనాన్ని తనకిచ్చి తన వృద్ధాప్యాన్ని స్వీకరించమని కొడుకులను కోరాడు. యదుతుర్వసులు అంగీకరించలేదు. అందుకు కోపించి యదువంశంవారికి రాజ్యార్హత లేకుండా తుర్వసుని వారు వృద్ధాప్యం రాకుండానే మరణించేటట్లు శపించాడు. ఆ యదువంశంవారే యాదవులు. రాజార్హతను కోలుపోయి పశుపాలనం స్వీకరించారు.

భారతదేశం మొదటినుండి వ్యవసాయ ప్రధానమైన దేశం. వ్యవసాయానికి పశువులు ప్రాణం. అందుచేత పశుపాలకులైన యాదవులు భారతీయార్థికరంగంలో విశేష ప్రాముఖ్యాన్ని గడించారు. హరివంశం భారతానికి ఖిలపురాణమని చెప్పబడింది అంటే హరివంశం లేనిదే భారతం పూర్తి కాదు. అది వట్టి భారత మౌతుంది. హరివంశంతో కూడి మహాభారత మౌతుంది. రాజులను, రాజరాజులను వర్ణించి అందుకు అనుబంధంగా యాదవుల కథను మహర్షి వ్యాసుడు జోడించడంవల్లనే ఆనాటి సమాజంలో యాదవులపాత్ర తెలియవస్తున్నది.

మరో విశేషంకూడా ఉంది. రాజుల మధ్య పోరాటంవల్ల భారతకథ చివరకు సమాజంలో అస్థిరత, అశాంతి ప్రబలాయి. ఆ క్లిష్టపరిస్థితులలో బీడుపడ్డ భూములను సాగుచేసి పంటలు పండించి శాంతిని, సౌభాగ్యాన్ని సంపదను పెంపొందించగల పశుపాలకులు యాదవుల జీవితాన్ని చిత్రించే హరివంశాన్ని రచించాడు మహర్షి వ్యాసుడు.

తురకల దౌర్జన్యాల తర్వాత స్వతంత్రాంధ్ర రాజ్యాన్ని స్థాపించిన వేమారెడ్డి ఆ స్తవ్యస్తమైన పరిస్థితులను చక్కదిద్ది సురాజ్యాన్ని నెలకొల్పవలసిన గురుతరమైన బాధ్యతను స్వీకరించాడు. ఇందుకు తొలిమెట్టుగా పాడుబడ్డ చెరువులను మరమ్మతుచేసి, కొత్తవాటిని త్రవ్వించి నీటివనరులను అభివృద్ధిచేసి వ్యవసాయరంగాన్ని చక్కదిద్దాల్సిన అవసరం ఏర్పడింది. ఇది దృష్టిలో ఉంచుకొనే ఎఱ్ఱనగారు మొదట రామాయణాన్ని రచించి ఆ వెనువెంటనే హరివంశాన్ని చేతపట్టారు. ఆయన దృష్టిలో రామాయణం దుష్టశిక్షణకు ప్రతీక కాగా హరివంశం శిష్టపాలనకు ప్రతినిధి అయింది ఇందువల్లే ఆయన హరివంశం అవతారికలో రామాయణ రచనాప్రసంగాన్ని కావాలని చేశాడు

( సశేషం )

# వేదుల సూర్యుని జ్ఞానమహస్సు

— డా॥ టి. బాలసుబ్బయ్య

(గత సంచిక తరువాయి)

తతశ్శరీరం సంక్షిప్య మహాపర్వత
సన్నిభం।
పునః ప్రకృతి మాపేదే వీతమోహ
ఇవాత్మవాన్।

అని చెప్పినాడు వాల్మీకి. హనుమంతుడు పెంచిన శరీరాన్ని 'మహాపర్వత సన్నిభం' అని సగుణోపమానంతో చెప్పాడు. కాని ఆంజనేయుడు తన శరీరాన్ని యథాస్థితికి తేవడాన్ని మాత్రం 'పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్' అని అజ్ఞానాన్ని విడిచిన జ్ఞానవంతునివలె మామూలు శరీరస్థితిని పొందినాడని నిర్గుణోపమానంతో చెప్పి అందలి అంతరార్థావగాహనకు తానే మార్గదర్శకుడయ్యాడు వాల్మీకి.

4. ఆంజనేయుడు లంకలో ప్రవేశించిన విధానాన్ని ద్వైతాద్వైతవిశిష్టాద్వైతపరంగా వ్యాఖ్యానిస్తూ శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు చేసిన వివరణ హృదయానందకరంగా ఉంది—

'విక్రమేణ మహాతేజాః హనుమాన్
కపిసత్తమః।
ద్వారేణ స మహాబాహుః ప్రాకార
మభిప్లువే॥'

శత్రువుయొక్క ఇంటిని ప్రధానద్వారంగా కాకుండా దొడ్డిదారిన ప్రవేశించడం (అద్వారేణ అభిప్లువే) అన్నది ఇందలి వాచ్యార్థం. 'ద్వి + అరం రెండు గదులు కలది ద్వారం. అంటే ద్వైతం ద్వారం కానిది అద్వారం. అంటే అద్వైతం. అంటే సాధకుని బుద్ధి (హనుమంతుడు) అద్వైతమార్గంలో తమోలోకానికి (లంకలోనికి), దశేంద్రియవృత్తులు అరచేతోటికి (దశకంఠ రావణుని స్థానంలోనికి) అద్వైత భావంతో (అద్వారంగా) ప్రవేశించాడని అద్వైతపరమైన అర్థం. 'కపిసత్తమోఽద్వారేణ' అని పూర్వరూప సంధి చేయకుండా ఉంటే 'ద్వారేణ' అని మాత్రమే వస్తుంది. అప్పుడు ద్వి + అరం అంటే ద్వైతం అని అర్థం. ఆంజనేయ సాధన అంటే బుద్ధిసాధన ద్వైతంగా ప్రారంభమై అద్వైతంగా ముగుస్తుందన్న రెండురకాల అర్థాలనిచ్చే విధంగా పదచ్ఛేదం చేయవచ్చు. ఇది ద్వైతపరం. 'అద్వారేణ' అన్నదానికి 'అస్య-విష్ణోః ద్వారేణ' అని తత్పురుష సమాసం చెప్పి 'విష్ణుపరంగా' అని అర్థంచెప్తే వైష్ణవమతపరంగా ద్వారాన్ని దాటాడు అని అంతరార్థం వస్తుంది. ఇది విశిష్టాద్వైతపరం. ఈవిధంగా అర్థాలు చెప్పడంలో విమర్శకుని పరిపూర్ణ సమన్వయ సామర్థ్యం ప్రకటితమౌతుంది.

అరణ్యకాండలోని అయోముఖికథ, శబరికథ, కిష్కింధాకాండలోని స్వయంప్రభకథలు మూలకథకు అంతగా సంబంధం లేనివైనా వాల్మీకి తనరామాయణలో వానికి అంతరార్థపరంగానే స్థానం కల్పించి నాడని చెప్పి శ్రీశర్మగారు వానిలో అంతర్గతంగా ఉన్న సాధనా విధానాన్ని చక్కగా విప్పిచెప్పారు. సుందరకాండలోని పెక్కుశ్లోకాలకు అంతరార్థప్రాధాన్యాన్ని వివరించిసుందరకాండవైశిష్ట్యాన్ని చెప్పడంలోను, యుద్ధకాండలో రామునికి అగస్త్యమహర్షి చెప్పిన 'ఆదిత్యహృదయం' అంతర్యాన్ని వివరించి దాన్ని బ్రహ్మాస్త్రంగా భావింప చేయడంలోను శ్రీ శర్మగారు చూపిన ప్రతిభ అనితరసాధ్యం.

చిత్రకూట మందలి వాల్మీక్యాశ్రమాన్ని మూలాధారచక్రంగా, అత్రిమహాముని ఆశ్రమాన్ని మణిపూరక చక్రంగా, శరభంగా శమాన్ని స్వాధిష్ఠానచక్రంగా, ఆంజనేయుని అనాహత చక్రంగా, సుగ్రీవుని విశుద్ధిచక్రంగా, ఆదిత్యహృదయాన్ని ఆజ్ఞాచక్రంగా శర్మగారుభావింపజేసిన విధానం మనోమోదకంగా ఉంది. ఈవిధంగా వీరు రామాయణాన్ని జ్ఞానపీఠంగా సిద్ధాంతీకరించారు. ఇంతకంటే దీన్ని గురించి చెప్పడం విస్తృతి కారణమే ఔతుంది.

## భారతం

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు మిగతా గ్రంథాలకు అంతరార్థాలు చెప్పటం ఒకయెత్తు ఒక్క భారతానికి చెప్పటం ఒకయెత్తు. భారతం ఒక బృహద్గ్రంథం. ఇందులో పెద్దకథ, అనేక పాత్రలు, సన్నివేశాలు, ఉపాఖ్యానాలు ఉన్నాయి. వీటన్నిటిలో వ్యాసమహర్షి నిక్షేపించిన హృద్గతభావాన్ని అమూలాగ్రంగా పట్టుకోటం అంటే మాటలు కాదు. అంతరార్థపరంగా ఇందులో జీవబ్రహ్మైక్య సాధనామార్గంలోని వివిధ సాధనాదశలు, ప్రలోభాలు, ఆటంకాలు, ఆఖరుకు సాధనాభ్రష్టత మొదలైనవన్నీ ముడిపడియున్నాయి. అందుకే శర్మగారు దీనికి 'ముక్తిసాధనామార్గం' అన్న సార్థకమైన నామాంతరాన్ని సూచించారు.

శ్రీ శర్మగారికి భారతాంతరార్థ వివరణలో ముందుగా ఎదురైన సమస్య అసలు అసలు కథను ఎక్కడనుండి మొదలు

పెట్టాలి అన్నది. ఇప్పుడు ప్రసిద్ధంగా లభిస్తున్న భారతానికి మూడువిధాలైన ఆరంభాలున్నాయి, వ్యాసుని జయేతి హాసం వ్యాసశిష్యుడు వైశంపాయనుని వల్లా, సూతమహామునివల్లా భారతం, మహాభారతం అనేపేర్లతో విమర్శకాభి ప్రాయం. జయమనే పేరుతో వ్యాసుడు చెప్పినకథకు ఉపరిచరవసుచరిత్ర ప్రారంభం (తథోపరిచరాదన్యే); ఆస్తీకుని కథ వైశంపాయనుని భారతకథకు ఆరంభం (ఆస్తీకాది తథాపరే), మనువు కథ సూతముని మహాభారత కథకు ప్రారంభం (మన్వాదిభారతం కేచిత్), ఇట్లా ఉన్న వాటిలో శర్మగారు వ్యాసుని జయేతి హాసాన్ని ఆధారంగా స్వీకరించారు. తమ అంతరార్థవివరణలో ముక్తిని సాధించడంలో సాధకునికి సాధనావిజయం ఎట్లా చేకూరుతుందో చెప్పడానికే 'జయం' అన్న పేరుతో పైకి కథాపరంగా అర్థమయ్యేటట్లూ, అంతరార్థపరంగా ముక్తిసాధనామార్గవిజయాన్ని సరితూంచేసి వ్యంగ్య శైలిలో వ్యాసుడు భారతకథను చెప్పాడని శర్మగారి సిద్ధాంతం.

ఉపరిచరవసు మహారాజు కథతో భారతాంతరార్థాన్ని ప్రారంభించారు శర్మగారు. ఉపరిచర వసుమహారాజు ఒకనాడు వేటకు వెళ్ళి, అచ్చట తనభార్య గిరికను తలచగా అతనికి వీర్యస్ఖలనం జరిగింది. ఆ వీర్యాన్ని అతడొక దొప్పలో పెట్టి ఒక డేగద్వారా తనభార్యకు పంపగా, మధ్యలో దానికిం కొక డేగతో మాంసఖండభ్రాంతితో పోరు జరిగివీర్యం యమునా జలంలోపడిపోయింది. ఆ వీర్యాన్ని అద్రిక అనే పేరుతో మత్స్యరూపంలో ఉన్న ఒక అప్సరస మ్రింగగా అది గర్భిణి అయింది. దాశరాజు అనే బెస్త ఆ చేపను పట్టికడుపు చీల్చగా అందులో నుండిపుట్టిన ఆడుబిడ్డను సత్యవతి లేక మత్స్యగంధి అనే పేరుతో పెంచాడు.

ఆమె ఒకనాడు యమునలో పడవపై బాటసారులను దాటిస్తుండగా పరాశర మహాముని ఆమెను మోహించి, యోజన గంధిగాచేసి, ఆమెతో భోగించగా ఆమెకు సద్యోగర్భంలో వ్యాసుడు జన్మించి ఆమెతలచినపుడు వస్తానని తపస్సుకు వెళ్ళాడు.

ఉపరిచర వసువు అంటే ఉపరి-ఆకాశమందు, చర-సంచరించే, వసువు-సంపద అనగా సర్వత్రవ్యాపించిన పరమాత్మ అని అర్థం. వీర్యమంటే జన్మకారకమైన పరమాత్మశక్తి భగవంతునికి సృష్టియందు కలిగిన ఇచ్ఛయే వీర్యస్ఖలనం. ఆయనదాన్ని తనభార్యకు అంటే గిరి + క = వాక్కునందున్న సుఖం అంటే తొలుబలుకైన వేదప్రతిపాదితమైన శుభానికి ఆశక్తిని డేగద్వారా పంపాడు. డేగ వేదము, వేదాంతములైన ఉపనిషత్తులకు ఉపలక్షకం. వేదాలు కర్మమార్గాన్ని, ఉపనిషత్తులు జ్ఞానమార్గాన్ని ప్రబోధించేవి. రెండు డేగలు పోట్లాడాయి అంటే కర్మ జ్ఞాన మార్గాలు పోటీపడ్డాయని అర్థం. అప్పుడు తమోగుణభరితమైన జడంలో-ప్రకృతిలో-మాయలో ఆపరమాత్మశక్తి ప్రవేశించిందనడమే ఆ వీర్యం యమునా జలంలో పడటం. అప్పుడు శాపగ్రస్తయైన ఒక అప్సరస అద్రిక అంటే ద్రవించునది కానిది అనగా నాశరహితమైన జీవాత్మ అనిఅర్థం. ఇది మత్స్యరూపంలో అంటే మత్ + స = అహంకార మమకారాలను నాశనం చేసేది అనగా మాయావృతమై అహంకార మమకార యుక్త వ్యష్టిజీవాత్మ వీర్యంకాగా, ఉపరిచరవసువుసమిష్టిపరమాత్మ అనిఅర్థం. ఈ వీర్యం వల్ల సత్యవతి పుట్టింది. అంటే జీవునిలో పరమాత్మలో చేరాలనే సత్యజ్ఞానమనోవృత్తి ఉద్భవించిందని యర్థం. ఈమె దాశరాజువద్దకు చేరడం అంటే

(సశేషం)



## శ్రీ వాసంతలక్ష్మి

సీ. కంఠశీత కోకిలల్ కూతసాధకములోన
బంచమగీతమాన్పాడుచుండ
మధుపసేనాపతుల్ మధుపరిఖలలోన
విరులయోడలబయి దిరుగుచుండ
శ్రీశుక పౌరులు చివురుపళ్ళెములోన
బండ్లగాన్కల బెట్టి పరచుచుండ
ఘనహంసభటులూగి
వనచరములోన
దూటిబూరలబూరి రోచుచుండ

ఆ.వె. చమరకన్నెవాల చామరంబులవీవ
సముమిత్రుడు రవి ఛత్రమెత్త
దర్పమంత్రి యితూధనువు
బూనపూన
విశ్వపీఠిని మధువిభుడు వెలిగె.

ఉ. ఎండకు వానకోర్చి కరుణించక
గత్తులరాలకోగడు పే
కెండసహించి పాంథమృగ పింహా
కరీశ్వర వానరాళికే
పొండజదేను సంతతికి పాత్రి హరించి
యొసంగి పండ్లు భూ
ఖండమున న్వెలింగె సహకారము
త్యాగివిరాగి చాడ్పునన్.

ఉ॥ చేతనకోటికి న్ద్వయము శ్రీయును
భర్తయు మూడు-సెన్మిదా
ధాతవు-నీకుపుత్రుడు ద్వాదశ,
సప్తమమున్ సురారికిన్
భీతునకిర్వ-దింద్రునకు వేయికనుల్
గలవంచు నిర్ణశ, స
చ్చ్యూతము భృంగపంక్తిమిష శోభిలె
వేల కనుస్గలట్టులన్.

— శ్రీ.వ.చ. శ్రీనివాసరామానుజాచార్య



# చషకంలో చంద్రుడు

— డా. పి. సూర్యనారాయణ

'రసో వై సః' అనేది ఉపనిషద్వాక్యం. 'వాక్యం రసాత్మకం కావ్యం', 'రమణీయార్థప్రతిపాదక శబ్దః కావ్యం' అనేది ఆలంకారిక మతం. రసాత్మకమైన వాక్యమో, పదమో కావ్యమవుతుందనేది స్పష్టం. ఆనందమూ ఉపదేశమూ కావ్యప్రయోజనాలు. అయినా ప్రథమ ప్రయోజనం ఆనందమే. కారణం, కావ్యం చదవగానే పాఠకుడికి ఆనందం కలగాలి, తద్వారా ఉపదేశం అందాలి. అలాంటి కావ్యమే ఉత్తమకావ్యమౌతుంది. అందువల్లే కవులు తమ కావ్యాల్లో రసగుళికల్లాంటి వర్ణనలు చేసి, కావ్యాల్ని రసమయం చేస్తారు. వర్ణనావైచిత్రికి ఎఱ్ఱన అందెవేసిన చేయి. ఆయన చూపిన మార్గమే ప్రబంధ కవులకు రాజబాటయింది. అందుకే ఆయన ప్రబంధ పరమేశ్వరుడు. ఎఱ్ఱన రాసిన "నృసింహపురాణం' ఒక ఉత్తమకావ్యం. ఎఱ్ఱన వర్ణనావైదుష్యానికీ, భావుకతకూ, ఉక్తివైచిత్రికీ దర్పణంపట్టే ఘట్టాలు ఆ కావ్యంలో కోకొల్లలు. ఉదాహరణకు మధుపానలీలావర్ణన ఘట్టం పరికిద్దాం.

ప్రకృతి కాంత వెన్నెల దుప్పటికప్పుకుంది. వెన్నెల పొంగులోకాన్ని మించి దిక్కుల్ని ముంచివెల్లువైంది. మనోహరమైన వెన్నెల అదిరాత్రి అనే తలంపూ, చీకటి అనే స్ఫురణా, అవ్యక్త అనే తలంపూ కలగనీకుండా కంటికి విందునీ, శరీరానికి చల్లదనాన్నీ, మనసుకు ఆనందాన్నీ కలుగజేస్తోందట. అలాంటి వెన్నెల్లో ఉద్యానవనంలో అందమైన సుందరాంగులలో సతీసహితుడైన హిరణ్యకశిపుడు విహరిస్తున్నాడు. సహజమైన సువాసనల్తో మదాన్ని చిప్పిల్లుతున్న మదిరను తెప్పించి సువర్ణచషకాల్లో నింపించాడు. అందరూ విలాసంగా చషకాలందుకున్నారు. ఆదృశ్యం చూసి రేరాజు సిగ్గుపడి తొలగిపోలేక తొంగి తొంగిచూస్తున్నాడు. చూడ్డమేకాదు, ఆ మధుపూరిత చషకాల్లో మునిగి తరించాడు. అంత సుందరమైన సన్నివేశాన్ని ఎఱ్ఱన ఎంత చక్కగా ఉల్లేఖించాడో చదివి తరించవలసిందే.

ఆ రమణుల మదిరారస
పూరిత చషకముల దోచు
పూర్ణేందుడు పా
ల్పారెను వాసనకై క
ర్పూరంపుం బల్కు విడిన పోలిక
మమరన్ - 3-95

అని, ఆ సుందరాంగుల మధుమయపాత్రల్లో ప్రతిబింబిస్తున్న పూర్ణచంద్రుడు, వాసనకోసం వేసుకున్న కర్పూరపు పలుకా అన్నట్లుగా కనిపిస్తున్నాడట. ఎంత చక్కని ఊహ. మరొక పద్యంలో-

నెలతయొకర్తు చేతి హరినీలశిలామయ
పాత్రిఁ బూర్ణ సం
వలిత తరంగయై పొరలు వారుణి దోచు
సుధాంశుమండలం
బలఘు కరాళ రాహువదనావాలి
స్రుక్కు కరంబు చిమ్మటిం
గలగి పొరింబొరి న్వడకు కైవడిఁ
గానగనయ్యె నయ్యెడన్ - 3-90

అని ఉత్ప్రేక్షించాడు. ఓ నెలత తన చేతిలోనున్న ఇంద్రనీలమణి మయ పాత్రలో పొంగిపొర్లే లా మధువుపోసుకుంటో ఏమోగాని! ఆమెపాత్రలోని మధువు సుళ్ళు తిరుగుతోంది. అందువల్ల అందులో ప్రతిబింబిస్తున్న చంద్రుడు కూడా వణకుతున్నాడు అది ఎలాకనిపిస్తుందంటే! రాహువుచేత చిక్కి మిక్కిలి బాధతో వణకుతున్నట్లుగానట.
మరో మదిరాక్షి చేతిలోనున్న చంద్రుడు కూడా వణుకుతున్నాడు. కానీ హేతువు మాత్రం అదికాదు-

సురుచిరపాన పాత్రమున సుందరి
యొక్కతె కేల నిండు చం
దురుడు ప్రకంపితాంగములతోఁ
దిలకించెఁ దదాన నాంబుజ
స్ఫురిత వికాసవైభవము సొంపులడం
పవ్రముచ్చిలించి చె
చ్చెరఁ జనుదెంచి పట్టువడి
చేడ్పడి భీతివడకు చాడ్పునన్.
3-97

ఈ సుందరిచేతిలోవున్న పాత్రలోకూడా చంద్రుడు వణుకుతున్నాడు. మధువు పొంగి పొర్లడంవల్ల దాన్ని ఏవిధంగా ఉత్ప్రేక్షిస్తున్నాడో చూడండి. ఆమెకి తనముఖముయు పాత్రలో వణుకుతూ చంద్రుడు తనను చూస్తున్నట్లు కనిపిస్తున్నాడు. ఆ వణకడానికి కారణమేమిటటా!

ఆమె వదనాంబుజంలోని సొగసుని దొంగిలించి, తొందరగా పారిపోబోతూ పట్టుబడి భయంతో వణకుతున్నట్లుగా కనిపిస్తున్నాడట. మరోపద్యంలో ఓ వన్నెలాడి వెన్నెల్లోని వెన్నని తనముఖ వర్చస్సును పెంచుకోవడం కోసం ఎలా తీసిందో చూడండి-

పొలతుకయొూత్ర యొప్పు మధుపూరిత
పాత్రిక గానవచ్చును
జ్జ్వల హిమధాముచేతఁ దనవ క్త్రము
కాంతికిఁ గాంతిపూరముల్
గలయఁగఁద్రచ్చి తేర్చి యొడికంబుగఁ
బుచ్చిన వెన్న కల్లులోఁ
గలపి కరంచి క్రోలుటకు గానిడికొన్న
తెఱంగు నందగన్, 3-98

తన ముఖకాంతి కోసమని, కాంతి కల్లు వను, సముద్రాన్ని చిలికి అందులో తేరిన వెన్నను తీసి దాన్ని కల్లులో కలుపుకొని త్రాగడానికి ఉంచుకుందా అన్నట్లుగా, తన చేతిలోని మధుపూరిత చషకంలో కనిపిస్తున్న చంద్రుని చేత ఆమె ఒప్పుతోందట. మరో పద్యంలో-

ఈ రమణీలలామ యెదవేంచునిఁ జెంది
పవిత్రయైన యి
వ్వారుణిగాని పాయదు ధ్రువంబుగ
సాత్త్వికలంక మంచు నిం
పార మునింగె గాక యమృతాంశు
డనన్ బ్రతిబింబ చంద్రుడొ
ప్పార నొకర్తు చేతిసముదంచిత
కాంచన పానపాత్రికన్-3-99

ఓ రమణి చేతిలోని బంగారపు పాన పాత్రలో ప్రతిబింబిస్తున్న చంద్రుడు ఎలా ఒప్పుతున్నాడంటే! ఆ రమణీ మణి ముఖచంద్రునితో మైత్రి పొంది పావనమైన మదిర తప్ప తన కళంకాన్ని పోగొట్టేది మరేదీ లేదని భావించి చంద్రుడందులో మనసు దీరా మునిగాడన్నట్లుగా కనిపిస్తున్నాడట. వారుణి అంటే యమున అని కూడా అర్థం. రెండూ నల్లనివే (మదిర, యమున), మరో పద్యంలో-

చషకమునఁ గామినీ ముఖ
చంద్రుడును సు
ధాంశుడును చించితాంగులై
యలరుటొప్పె
నర్థిఁదమలోన జెలిమిసేయంగ శపథ
మునకు వరుణ తనూజలో మునిగినట్లు-
8-100

చషకంలో చంద్రుడూ, ఆ సుందరి ముఖచంద్రుడూ ప్రతిబింబిస్తున్నారు. ఆ దృశ్యం ఎలావుందంటే? వాళ్ళిద్దరూ తమలో తామూ కోరికతో స్నేహం చేయడం కోసం ప్రతిన బూనడానికి యమునలో మునిగినట్లుగా ఒప్పుతున్నారట.

ఈవిధంగా ఎత్తిన ఈఘట్టంలో తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. ఏ పద్యానికా పద్యం తీసుకుంటే ఉత్ప్రేక్షాలంకారమూ అన్ని పద్యాల సమాహారాన్ని తీసుకుంటే ఏదో ఉల్లేఖనం అవుతుంది.

* * *

- డా. పి. సూర్యనారాయణ
డోరు నెం. 25-8-140
ఎ. హాన్మాగాంధి రోడ్డు
ఒకటవ టౌన్ పోలీసుస్టేషన్
విశాఖపట్టణం-530001

...—...

# కుమారగిరిరెడ్డి - ధీరలలితుడు

పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి

"నయతి వృత్తం ఫల మాప్నోతి చ" కావ్యంలోని ఇతివృత్తాన్ని నడుపుతూ, ఫలితాన్ని పొందేవాడు నాయకుడు. అతడు సత్కులీనత, మహాభాగ్యం, ఔజ్జ్వల్యం, ఔదార్యం, మహోవిశాలత, ధర్మైకలనం, వైదగ్ధ్యం, స్థైర్యం, దక్షత, వాగ్మిత, కృతజ్ఞత, నయజ్ఞత, శుచిత్వం, మానిత్వం, ప్రజారంజకత్వం మొదలైన సల్లక్షణ సముపేతుడై ఉండాలని ఆలంకారికులు నిర్ణయించారు. ఈ నాయకులు ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరశాంతుడు, ధీరలలితుడు అని నాలుగు విధాలుగా ఉంటారు "ధీరశ్చ అసౌ లలితః"- ధీరుడూ, లలితుడూ ఐనవాడు ధీరలలితుడని నిర్వచనం. "నిశ్చింతో మృదు రనిశం కలాపరో ధీరలలితః స్యాత్" అని సాహిత్య దర్పణం (3-68). "నిశ్చింతో ధీరలలిత స్తరుణో వనితా వశః" అని రసార్ణవ సుధాకరం (1-75). మంత్రులు మొదలైన వారిమీద రాజ్యభారాన్ని ఉంచి, నిశ్చింతగా ఉండేవాడు, మృదుస్వభావం కలవాడు, లలితకళానిరతుడు, స్త్రీలోలుడు, భోగపరాయణుడు, యుద్ధ విముఖుడు ఐనవాడు ధీరలలితుడని తాత్పర్యం.

కొండవీటి రెడ్డిరాజుడు, కర్పూర వసంతరాయ బిరుదాంచితుడైన కుమారగిరిరెడ్డికి (క్రీ.శ. 1386-1402), లకుమ అనే నర్తకికి మధ్య నడచిన ప్రణయకలాపాన్ని ఇతివృత్తంగా తీసుకొని, డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారు 'కర్పూర వసంత రాయలు' అనే మధుర గేయకావ్యాన్ని రచించారు. ఆ కావ్యనాయకుడైన కుమారగిరిరెడ్డి ధీరలలితుడు. అతనిలో ఈ లక్షణాలన్నీ సంపూర్ణంగా ప్రోది చేసుకొన్నై.

రెడ్డిరాజులు మహేంద్రవిభవులు; వేద మతోద్ధారకులు; కావ్యారంభంలో వంది మాగధులు చేసిన కైవారాలలో నారా

యణరెడ్డిగారు కుమారగిరిలోని అనేక ఉన్నత లక్షణాలను సమగ్రంగా చిత్రించారు. అతడు సర్వాతిశాయియైన సామ్రాజ్యానికి అధిపతి. పంటకుల పద్మ సంపద్ద్యోమణి. రెడ్డికులరత్నం. ఆ వంశపు కీర్తిప్రాపైనవాడు. సర్వసర్వం సహాఖర్వభూర్వహుడు. ప్రతాపవంతుడు, కనకభూభృద్ధైర్య సాంద్రుడు. కన్నులకు విందుచేసే సుందర రూపం అతనిది. ప్రస్ఫుర దృప్రివ్యా తేజ స్ఫురత్ఫాలతల విస్ఫుర ద్రాజరేఖ కలవాడు. మన్మథునికి ద్వితీయాకృతి. ఆజానుబాహు శోచిర్మూర్తి కల్పవృక్షానికి మానవరూపం.

కుమారగిరి పరమమాహేశ్వరుడు. కథారంభంలో అతడు చేసిన విఘ్నేశ్వరపూజ, శివార్చన, మదనారాధనం, లకుమా ద్వితీయుడై అహోబలానికి వెళ్ళినప్పుడు ఆ నరసింహస్వామిని, దక్షారామంలో భీమేశ్వరుని పూజించిన, వినుతించిన విధానం అతని ధర్మాకళనానికి నిదర్శనం. వసంతోత్సవ సమయంలో అతడు కాటయ వేముడితో సంభాషించిన తీరులో అతని శబ్దవైదుష్యం మనకు గోచరిస్తున్నది.

వసంతరాజీయం అనే నాట్యశాస్త్రం అతని అద్భుత సృష్టి. అందులో అతని వైదగ్ధ్యం కనిపిస్తుంది మనకు. ఈ విషయాన్ని రెడ్డిగారు ఈవిధంగా విశ్లేషించారు.

భరతుడు చూపించనట్టి
భావమ్ములు చూపె లకుమ
భరతుడు రచియించనట్టి
భంగులు రచియించె రాజు.
ఆమె కాలు మోపగనే
అదియె నాట్యమైనట్టుల
అతడు గంట మాడించిన
అదియె శాస్త్రమై పోయెను.

(పుట. 118)

కుమారగిరిరెడ్డి మహాప్రతాపవంతుడైనప్పటికీ, అతనిలోని కళాహృదయం ఆ ప్రతాపాన్ని అధఃకరించింది. ఆ కారణంగా అతడు యుద్ధ రాజ్యసింహాసన విముఖుడయ్యాడు. తన రాజ్యభారాన్నంతటినీ శౌర్యధాముడైన కాటయ వేముడి భుజస్కంధాలపై మోపి, లలిత కళానిరతుడై కాలాన్ని కర్పూరంలా వెలిగిస్తూ గడిపాడు.

కర్పూర వసంతరాయల హృదయం కుసుమ సదృశం. దక్షారామంలో లకుమ గిరిజా కల్యాణ ఘట్టాన్ని నర్తిస్తున్నది. మన్మథ దాహ సందర్భం రాబోతున్నది. వెన్నవంటి హృదయతంత్రులు గల రాయడు చివాలున లేచి, లకుమను సమీపించాడు. గద్గదస్వరంతో_

లకుమా! ముందటి దృశ్య
మ్మిక చూడగలేను.
భర్గుని చిచ్చుల కంటిని
భరియించగలేను.

అంటూ ఆమె నాట్యాన్ని ఆపాడు.

కొలువుకూటంలో ఉన్న కుమారగిరి లకుమ కాలు బెణికిందనే వార్త విని, సభను విడిచి ఆమెవద్దకు పరుగెత్తాడు. తలిరాకు కన్నా కోమలమైన ఆమె చరణాలను తన ఒడిలో ఉంచుకొని సంవాహనం చేస్తూ పసిపిల్లవాడిలాగా విలపించాడు. అందువల్లనే రాణి కోరిన ప్రకారం రాజును శాశ్వతంగా వదలి వెళ్ళవలసి వచ్చినప్పుడు_

అతనిని విడిచి యెచటికైనను
పోతినా యింకేమి యున్నది?
వెర్రి యెత్తిన వానివలె బెం
బేలు వడి తిరుగాడు రాయడు!

(పుట 151)

అని బాధపడ్డది లకుమ. అంతటి మనోమార్దవం కలవాడు కుమారగిరి.

కుమారగిరి అభినవ రాజకళా సమ్రాట్టు; కళాదుగ్ధసాగర మనోముగ్ధ సంపూర్ణ చంద్రముడు; కలావాన అని ప్రశంసింపబడినవాడు.

ధీరలలితుడిలో ఉండవలసిన స్త్రైణ లౌల్యం కుమారగిరిలో ఎక్కువస్థాయిలోనే ఉన్నది. లకుమ ప్రకృతి, రాజు పురుషుడు. ఆమె నది; అతడు సముద్రుడు. లకుమతో పరిచయమైన కొద్ది కాలానికే రాజు లకుమా విస్ఫురితాంగ సౌందర్య ప్రమత్తుడయ్యాడు. లకుమా మనఃపంజర కీరుడయ్యాడు. తల్లగిన్న పంచప్రాణుడయ్యాడు. ఆమె అడుగుల ప్రోల తన బ్రతుకును ధారవోశాడు.

మొట్టమొదట కొండవీటిలో లకుమను గురించిన ఆలోచనలతో మదనతాపాన్ననుభవిస్తున్న రాజుకు పానుపు మీది ప్రఫుల్ల మల్లికలు పల్లేరుకాయల లాగా తోచినై. తర్వాత అహోబలంలో లకుమా సన్నిధానంలో రాతి తిన్నె మీద శయనించిన అతడికి ఆ రాతి తిన్నె పూల సెజ్జకన్న అతి శీతలమైన సుఖాన్ని ఇచ్చింది.

రాజ్యాన్ని గురించి, రాణిని గురించి ఆలోచించవలసిందిగా లకుమ రాజును ప్రార్థించింది. ఐనప్పటికీ అతని మనస్సు వాటివైపు మరల లేదు.

ఎవరెంతగ నన్ను రమ
ణీ! నా చిత్తము మారదు.
నీదు సాహచర్య చికీ
ర్షా దాహము చల్లారదు.

* * *

లేత కన్నెమైనను సరి
యే శశిబింబ ప్రతిబిం
బమ్ముగు నీ యానన బిం
బమ్ము శరణ్యమ్ము నాకు.

(పుటలు 144, 145)

అని స్థిరంగా పలికాడు. అదీ అతని లకుమా తౌల్యం. అతని ఈ మాటలు దానికి పరాకాష్ఠ.

ఈ స్థితిలో రాజు యుద్ధవిముఖుడు, రాజ్యవిముఖుడు అయ్యాడు. బ్రతుకును సౌరభలహరీ ప్రతిగా, మహతీమధుర శ్రుతిగా, తీర్చిదిద్దుకొన్నాడు. ఆ వైనాన్ని నారాయణరెడ్డిగారు గొప్పగా చిత్రించారు.

కాటయవేముడు 'సమరయాత్రకు ఆన తివ్వవలసింది'గా రాజును కోరాడు. రాజు హృదయంలో తీయగా నిద్రపోతున్న పౌరుష బడబాగ్ని ఒక్కసారిగా విజృంభించింది. వెంటనే అతడు కాటయ వేమునితో_

"జాప్యమేల ? యీ నాడే
సమర భేరి మ్రోగింపుము
అవశ్యముగ నేనుగూడ_.
అనబోవుచు నాగ లేదు. (పుట 111)

లకుమా దివ్యసౌందర్యం గుర్తుకు రావటమే అందుకు కారణం. ఇప్పుడు అతని ముఖంలోని శౌర్యరేఖ మాసిపోయింది. అతనిలోని పౌరుషాగ్ని జావ వెన్నెలై పోయింది.

కుమారగిరి వసంతరాజీయ రచనను పూర్తిచేశాడు. అతడా నాట్యగ్రంథాన్ని లకుమ చేతుల్లో ఉంచి_

జైత్రయాత్రలందు ఏమి
సాధించెడివాడ నేను ?
ఒక భూపతి నెత్రు పంటయో
ఒక సతి కన్నీటి మంటయో. (పుట 119)

అన్నాడు. రాజులోని ఈ బలహీనతను గమనించిన కాటయవేముడు "మీరొక్క సారి ఆస్థానానికి వచ్చి కూర్చోండి. మిగిలిన భారాన్ని నాకు వదిలివేయండి" అన్నాడు. "అవనీపతి ఔనని తల / వాడించక తప్పలేదు". ఫలితంగా_

బంగరు సంకెలలో తన
పాణి యుగ్మ మిరికి నటుల
ఓటు పడుచు రాయండా
నాటి నిశీథము నీడ్చెను. (పుట 128)

లకుమా సౌందర్య తౌల్యం అంతటి స్వధర్మవైముఖ్యానికికూడా దారి తీసింది.

* * *

నిజానికి కుమారగిరి అన్యస్త్రీలోలుడై అటు భార్యనే కాదు, ఇటు రాజ్యాన్ని, సింహాసనాన్ని, ప్రజలను పట్టించుకొన్నవాడు కాదు. కాని, అతని రాసిక్యం, మృదుస్వభావం, కళాహృదయం, ఆ అవలక్షణాన్ని కప్పిపుచ్చినై. అందుకే అతని పట్ల మనకు చులకన భావం కలగదు. నారాయణరెడ్డిగారి కలం నేర్పుకూడా ఇందుకు దోహదం చేసింది.

* * *

లకుమా కుమారగిరి రెడ్డిల ప్రణయ జీవితాన్ని గురించిన ఆలోచన మన మనస్సులలోకి రాగానే, కవిగారన్నట్లుగా "సహస్ర మల్లికల సౌరభం ఒక్కుమ్మడిగా వీచిన"ట్లుంటుంది. కుమారగిరి తన జీవితాన్ని ధీరలలితంగా గడిపినవాడు. కొండవీటి సామ్రాజ్య చరిత్రలో అతని జీవితచరిత్ర సుమ మరందంతో వ్రాయదగినది. అతడు అన్వర్థ బిరుద నామధేయుడు. వత్సరాజాదుల తర్వాత ధీరలలిత నాయకుడికి, ఒక మంచి ఉదాహరణ కుమారగిరిరెడ్డి.

(కర్పూర వసంతరాయలు : ఎమెస్కో ప్రచురణ, జూన్ 1972).

* * *

పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి,
చింతలపాటివారి వీధి,
అరండల్ పేట,
నరసరావుపేట,
గుంటూరు జిల్లా.



# నవ్యసందేశం

—కళ్యాణి

సందేశంలేని కవిత్వం
అదనుకు సాయపడని జవసత్వం
సంసార పాడే తత్వం
వెన్నెలోయ్! అడవిగాచిన వెన్నెలోయ్!

క్రియాశూన్య నినాదం
రాజకీయ నాయకుడి వాగ్దానం
చవిటిపఱ్ఱ "భూదానం"
ఎండమావికి సమానం.

స్వార్థపరుడి సోషలిజం కూ(కో)తలు
కాకి కూసే కోకిల కూతలు
ఆబోతుకు పుష్టియైన మేతలు
వ్యర్థమోయ్! అనర్థమోయ్!!

మానీపై "మేక్" పాదాలు
భూమిపై శాంతివాదాలు
ఎత్తున ఎగిరే మేథావి
సాటిలేని ఎత్తును సహించని దుస్స్వభావి.
పెంచుకోవాలోయ్ మానవత్వతత్వం
ముచ్చుకు వేసిన వోట్లు!
అచ్చుపడని దొంగవోట్లు!!

మనకు చూపు ఆశల బాటలు
వాడి స్వార్థానికి కట్టుకొనే కోటలు
పట్టుకు పట్టకు చెడ్డబాట!
నీ నిజాయితీ నీకు కోట!!

$0_0 0$



## శరీర వర్ణన

—శ్రీ గోరేభట్ల రఘురామశర్మ

తిలకము ముజ్జగాల జలదీప మహోత్సవ
నిత్యనూత్నమం
గళకర భోగభాగ్య సుముఖమ్ము
ముఖమ్ము ప్రశస్తిగాంచు చి
త్కళకళ లుల్లసిల్లి వెలుంగల
కీర్తిప్రదీప్తివ్యాప్తి కో
మల మనిపించు స్త్రీలతల మానికమై
తిలకింప నెచ్చటన్.

కంకణముల్ కరాల లయకంపిత గుంభిత
నిక్వణమ్ముతో
పొంకము లేని శిష్ట మణిభూషణముల్
విలసిల్లినట్టి ని
శ్శంక మనోజ్ఞ రాగ సుమసంగమశోభిత
నాట్యవేద లీ
లాంకములై వెలుంగు ధరలూన్వయ
శాస్త్ర వినోదమోదమై

కుంతలముల్ వినీలమయ కోటిద్విరేఫపు
పంక్తికాంతి నీ
మంతములే వికాసమసమానములంకృత
సచ్చరిత్ర హే
మంతమా విశిష్టకుసుమాల పరీమళ
మేళనల వా
సంతములై శిరాన తమ జన్మను సార్థక
మొందుచుందునే.

కరములు రత్నముల్ పొదుగు కంకణ
నిక్వణమైన మద్దుటుం
గరములు నంగసౌష్ఠవప్రకాశ మొనర్పగ
నేర్పు చేరతీ

కరములు నృత్య తాళ లయ గాత్ర
సమన్విత నూత్న తేజ సం

## నీరాజనము

—శ్రీ కనగవ నరసింహస్వామి

సీ॥ లెక్కకందక మింటనిక్క
చుక్కలలోని
నికరంపు నునుబచ్చి నిగ్గు కేర్చి
క్రొత్తగా విరిసిన కమ్ముదాటవులనుండి
పరతెంచు నరసౌరభంబుగూర్చి
గౌతమీ జలవీచికలపైని విహరించు
తరుణానిలముల శైత్యమును జేర్చి
కర్పూరంబులుబోలె పుప్పొళ్లుబరెరాలు
వెలది వెన్నెలలోని తెలుపుదార్చి
చారు శారద లక్ష్మిగా భారతమును
దీర్చి గాసట బీసటం దృప్తిగాంచు
నేలకాదిమ కావ్యమందించినాడ
వయ్య నన్నయ్య వాల్మీకివయ్య మాకు.

ఉ॥ చేరి చళుక్యభూవరుడు చేతులు
మోడిచి భారతమ్ము నే

స్ఫురణముల్లై తనూన్న లక్ష్మి ఖ్యాతి
గడించెడు కార్యసాధనల్.

కనులే సృష్టి విచిత్రరీతిగన సంకల్పంబు
ంచు భాగ్యి
ధనమా జ్ఞానవిశిష్ట వాఙ్మయ
యశోవాల్లభ్యమున్ పొందు సా
ధనమా దర్శనమార్గ ప్రప్రథమ
నద్యత్సూర్యతన్ గొన్న జీ
వనమై సాగు శరీరధర్మరతి సర్వస్వంబు
కాదై జనున్.

...(o)...

కోయిల రేయి నీవు కనుగొన్న్కల
మోదజలమ్ములొల్క శ్రీ
కారము చుట్టలేమి బలి! కారణ
జన్ములు మీరలీనసం
స్కార ధురంధరుల్ తెలుగుజాతి
తపస్సులు పండ సత్కవీ!

ఉ॥ పోవును రాజ్యమున్ సిరియు,
పోవును దేహము ధాత్రినిత్యమై
కేవలమున్ యశంబె తులకించు
నిజంబు చళుక్యవంశజుల్
భూవిభులెందరుర్వి విడిపోయిరో!
రాజనరేంద్రు డొక్కడే
నీ వరవాక్కులన్ బ్రతికి నేకు
లతింగను కీర్తికాయుడై.

చ॥ సులలిత వాక్ప్రయంబును ప్రసన్నకథా
కవితార్థయుక్తియున్
తెలుపగు నూక్తులున్ మెఱయ
జేసెద కబ్బమటంచు పగ్గెలన్
పలుకగవచ్చుగాని మతి పక్కన
యట్లు రచింపవచ్చునే
యిలపయి నీకె చెల్లినది యొల్ల
త్రిలింగ కవీంద్రవల్లభా!

చ॥ పలుకుల పైదలిన్ మొదట ప్రార్థన
సేయక గజ్జెలుపున్
దలపక వ్యాసవాల్మికుల ధ్యానము
సేయక కాళిదాసులో
తెలపక నిన్ స్మరింపక కృతిం
బచరింప దొడంగ రెవ్వరీ
తెలుగు పొలమ్మునందు కవిధీవిభవుల్
ప్రథమాంధ్ర సత్కవీ!

—డా॥ అయ్యగారి నరసింహమూర్తి

... O....

